

పడమటి సంధ్యారాగం

ఫొటో : నీలంరాజు మురళీధర — మద్రాసు.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సచిత్రవారపత్రిక
Founder : K. NAGESWARA RAO

సంపుటము 48
సంచిక 8
20-10-54

జయ ఆశ్వయుజ బహుళ నవమి బుధవారం

రచయితలకు
వారపత్రిక ఇస్తున్న సదవకాశం

ఉత్తమ రచనకు

బహుమతి రు 250

రచనలు చేరవలసిన ఆఖరు తేదీ

ఫిబ్రవరి 1, 1955

వివరాలకు పై వారం వారపత్రిక చూడండి.




"వితత జగద్భరంబు దన
 వీపున దాల్చిన కూర్మనాథుడున్,
సతతము చంద్ర భాస్కరుల
 చక్రము ద్రిప్పు ధ్రువుండు, సజ్జనుల్;
ప్రతిథ వటాండ జంతుఫల
 రంధ్ర నివాసమశకంబు లట్లు, నిం
దిత విఫలార్ధ సంగతి
 జనించి నశించు దదన్యజంతువుల్."

తా॥ విశాలమైన జగత్తుయొక్క భారమును తన వీపున దాల్చినటువంటి ఆది కూర్మమున్నూ—చంద్రుడు సూర్యుడు మొదలైన జ్యోతిర్మండల చక్రమున కంతటికీ కేంద్రస్థానమువలె ఉండి త్రిప్పుచున్నటువంటి ధ్రువుడున్నూ సజ్జనులై యున్నారు. మిగిలిన జంతుజాలము లన్నియున్నూ బ్రహ్మాండమనెడి మేడిపండునందు (జంతుఫలమునందు) ఉన్నటువంటి రంధ్రములో నివసించెడి మశకంబు లట్లు (రెక్కల పురుగులవలె) నిష్ఫలముగా జన్మించి నశించేటటువంటివే.

అందరూ పల్లకీ యెక్కితే మోసేవాళ్ళు ఎవరు? అనే ప్రశ్న జగత్ప్రసిద్ధంగావుంది. అదేవిధంగా, అందరూ పల్లకీ మోస్తామనే యెడల, పల్లకీలో ఎక్కేవారు ఎవరు? అనే సందేహం నిస్సందేహంగా కలుగుతుంది. పల్లకీలో యెవ్వరూ ఉండని పక్షములో దానిని మరొకరు మోయవలసిన అవసరం అనవసరం. అందువల్ల పల్లకీ అనేది ఒకటి ఉన్నట్లయితే దానిని మోసే వారు కొందరుండాలి. దానిలో కూర్చుండే వాళ్లు కొందరు ఉండాలి. దాని భారం ధరించేవాడు పల్లకీ భర్త అవుతాడు. ధరింపబడేది భార్య. ఈవిధంగా ధరింపబడే భార్యయున్నూ ధరించే భర్తయున్నూ ఉన్నప్పుడే సంసార చక్రం తిరుగుతూ ఉంటుంది.

అయితే సాకల్యంగా, సమూలంగా, నిదానంగా, నిజంగా ఈ జగములోని జంగమస్థావరముల తత్వం మథించి శోధించి చూచినట్లయితే, కదలక మెదలక స్థావరంగా స్థిరంగా ఇల్లుదాటని ఇల్లాలు లాగున కూర్చుండేవి కొన్ని జగత్తులో కన్పిస్తాయి. నిత్యసంచారం చేస్తూ జంగాలవలె, సర్క్యులు ఆఫీసర్లవలె, ట్రావెలింగు ఇన్‌స్పెక్టర్లవలె తిరుగుతూ ఉండేవి కూడా జగత్తులో కొన్ని కన్పిస్తున్నాయి. సూర్యుడు స్థిరంగా ఉన్నాడని ఎంచి, దానిచుట్టూ భూమి తిరుగుతోంది జంగమంలాగున అంటున్నాము. స్థిరంగా కదలకుండా ఉండేది భూమి అని భావించినప్పుడు భూమిని స్థిరాస్తి అంటున్నాము. రొక్కంగాని వెండి బంగారంగాని ఒక చోటునుంచి యింకొక చోటుకు తీసికొనిపోతున్నాము గనుక దీనిని చరాస్తి అంటున్నాము. ఈ విధంగా మనకు తోచినవిధంగా ఆయా విషయాలను స్థావర జంగమాలుగా, స్థిరచరములుగా విభాగిస్తున్నాము.

ఏదైనా ఒక కావ్యంగాని, కథగాని రచింపబడినప్పుడు, ఆ కథ మొత్తముమీద ఏవిధమైన భావం ఏవిధమైన రసం మన హృదయంలో అది ఉద్భవింపజేస్తుందో దానిని పరిశీలించి చెప్పగల్గినట్లయితే, ఆ కథలో ఆ భావాన్ని, స్థాయీ భావంఅని నిర్ణయిస్తాము. కథ అంతా విన్న తర్వాత మనకు హృదయంలో మిగిలేది ఏమిటి? అని చూచుకోవాలి. శకుంతల నాటకం అంతా చూచినపిమ్మట, మన హృదయములో నాటుకొనిపోయిన ప్రధాన భావం ఏమిటి? శృంగారరసం అని నిర్ణయించినట్లయితే, దానికి శృంగార శాకుంతలం అని నామకరణం చేస్తాము. ఆ నాటకానికి శృంగారరసమే స్థాయిభావం అని నిర్వచిస్తాము. కాని, యీ నాటకంలోనే రౌద్రం భీభత్సం, శోకం, మొదలైన రసాలుకూడా ఆయా కథారంగములలో మధ్యమధ్య ప్రకటింపబడి, మబ్బువచ్చి విడిపోయినట్లుగా విడిపోవచ్చును. పానకంలో మిరియపుగింజల పొడివలె మధ్య మధ్య నోటికి తగులవచ్చు. కాని పానకముయొక్క రుచి ఏమిటి? అని ప్రశ్నిస్తే, దాని రసము "మధురరసం" అని చెప్పడం సహజం. ఈ విధంగా మన హృదయభావములలో కూడా స్థాయిభావాలు కొన్ని ఉంటాయి. సంచారిభావాలు కొన్ని ఉంటాయి. ఎంత శాంతమూర్తికైనా ఏదో ఒక సమయంలో విసుగెత్తి రవ్వంత కోపం రావచ్చు. గాంధిమహాత్ముడు అతి శాంతమూర్తి. కాని ఆయన తన తత్వమును తానే విమర్శించుకొనుచూ, ఒకపర్యాయం తనపత్రికలోనే వ్రాసుకొన్నాడు. తనకు అతిసులభంగా చిరాకు కలుగుతూ ఉంటుందనిన్నీ, తనకు కోపం ఎప్పుడూ ముక్కుమీద ఉంటుందనిన్నీ వ్రాసికొన్నాడు. ఏమైతేనేమి? ఆయన కది సంచారిభావం మాత్రమే అవుతుంది. కాని ఆయనయొక్క స్థాయిభావం శాంతమే అని స్పష్టంగా చెప్పవచ్చు.

కళాప్రపంచంలో యీ రహస్యం కనిపెట్టి చిత్రించడం అవసరం. అవిధంగా స్థాయిభావం ఏదో దానిని చూపించడం

# విషయానుక్రమణిక

ముఖచిత్రం : నటి జానకి.

వలనే ఆమూర్తిలో ఉండే పరమార్థమూ, అంతరార్థమూ, ఆత్మస్వరూపమూ ప్రస్ఫుటమవుతుందని మనకళావేత్తలు నిర్ణయించారు. "ప్రసన్నాంజనేయ" విగ్రహం ఏవిధంగా ఉంటుందో చూడండి. చేతులు రెండూ జోడించి రాములవారికి నమస్కరిస్తూ ఉన్నటువంటి భక్తితత్పరుడైనఆంజనేయుల వారివిగ్రహంలో ప్రసన్న భావంతాండవిస్తూ ఉంటుంది. నటరాజమూర్తియైన శివుడు ప్రళయతాండవం చేస్తూ ఉన్నట్లుగా తయారుచేయబడిన ప్రతిమలో రౌద్రం, విలయం అప్రతిమానంగా తాండవమాడుతూ ఉంటాయి. దేవతా విగ్రహములకు మాత్రమే కాకుండా మనుష్యవిగ్రహములకు కూడా యిటువంటిజీవకళ, యిటువంటి స్థాయిభావ పరమార్థము స్థిరలక్షణముగా, ఆ మూర్తి యొక్క ఆత్మస్వరూపముగా, జీవకళగా, ప్రదర్శించి ప్రాణప్రతిష్ఠ చేయడం శిల్పమునకు గాని, చిత్రకళకు గాని అత్యంతావసరమని భావించి భారతీయ కళావేత్తలు రూపకల్పనకొక సూత్రం నిరూపించారు. సహజస్వరూపం అంటే బాహ్యస్వరూపం కాదన్నారు. తాత్కాలిక క్షణభంగురమైన ఒకానొక భంగిమను ఒక క్షణంలో ఫొటో తీయడం భారతీయ చిత్రకళయొక్క ఉద్దేశం కాదు. భారతీయ శిల్పకళయొక్క లక్ష్యం కాదు. ఫొటో తీసిన క్షణంలో ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశం పంతులు గారు యోగివలె కండ్లుమూసికొని దీర్ఘాలోచనానిమగ్నులై యుండవచ్చును. కాని, ఆయన బ్రిటిష్ సింహాన్ని ఎదిరించిన ఆంధ్రసింహం అని చూపించగల ఫోటో కాదది. ఏనాటికైనా ఆంధ్ర కేసరియొక్క చిత్రపటమును భారతీయ చిత్రకారుడు చిత్రించి, ఏ ఆంధ్రరాజ భవనములోనైనా ప్రతిష్ఠించవలెనంటే, వెన్నివ్వక రొమ్మిచ్చి నిలువబడి ఎదిరిచి నిలువరించిన యోధునివలె చిత్రించక తప్పదు. అది ఆయన సహజ ఆత్మస్వరూపమును నిరూపించగల, ఆత్మప్రతిబింబముగా ఉంటుంది.

చిరునవ్వునవ్వుతూ నిలువబడి దరహాస విలాసంతో ఫొటోతీయించుకోవడం, తీయడం, యీయుగంలో నొక వగగా ఉంది. ఈనాడు నిజంగా రావణాసురుని ఫొటో తీయుటకై, విమానాశ్రయంవద్ద ఆయన దిగగానే ఫొటోలు తీసే కామెరా యంత్రాలతో పత్రికా ప్రతినిధులు హాజరైనట్లయితే, ఆ సమయంలో రావణాసురుడు రవ్వంత చిరునవ్వు నవ్వుతూ నిల్చుండక తప్పదు. తన ప్రక్కనున్న వైమానికునివద్ద నవ్వుతూ సెలవు తీసికొనుచున్నట్లుగా నిలువబడితే చాలు. వెంటనే, ఆ దరహాస చంద్రికల యందము చిందువందునట్లుగా ఫొటోలు తీస్తారు. యీకాలంలో ఫొటోలో పడేవాళ్ళందరూ నవ్వుతూ పడాలనే ఫ్యాషను పరిపాటి అయింది. నవ్వడం అనేది ముఖానికొక రసకల్పన చేస్తుంది. ఆ మాట నిజమే. కాని, "ఇహీహీ!" అనే ముఖం చూచి "అహాహా!" అని మెచ్చుకొనే లోకం ఒకటి ఉండితీరాలి. పండ్లు ఇకిలించడంలో పరిపక్వమైన భావం ఏమీ స్ఫురించదు. భావగాంభీర్యం అనేది పైకి తొణకదు. నిశ్చలత్వం, నిర్మలత్వం, నిర్మోహత్వం, ఈ లక్షణాలు జ్ఞానసముద్రుడైన వానికి ఉండే ఆత్మపరిపక్వ చిహ్నములు. బుద్ధవిగ్రహం చూస్తే యీ ప్రబోధం కలుగుతుంది. బుద్ధుడు బోధివృక్షం క్రింద కూర్చుండి దీర్ఘకాలం తపస్సు చేశాడు. ఈ తపస్సులో తన శరీరాన్ని శుష్కింపజేశాడు. "ఇహాసనే శుష్యతుమే శరీరం" (నా శరీర మిచ్చటనే యీ పీఠము మీదనే శుష్కించి పోవుగాక!) అనే దృఢసంకల్పంతో తపస్సు చేశాడు. శుష్కించిపోయినాడు. అటువంటి బుద్ధుణ్ని ఫొటో తీసినట్లయితే ఎముకల బొమ్మవలె ఆ బొమ్మలో కన్పించేవాడు. అది అసలైన తపస్సంపన్నుడగు బుద్ధుని నిజమైన ఫొటో. కాని, మనదేశంలో లభించి నటువంటి బుద్ధవిగ్రహాలు ఆ విధంగా చెక్కబడలేదు. బుద్ధదేవుని విగ్రహంలో ఒక్క ముడతకూడా కన్పించదు ఒక్క ఎముక అయినా పైకి పొడుచుకొనిరాదు. ఆయన ఆత్మ ఎంత పరిపక్వమైనదో ఆయన దేహం కూడా అంత పరిపక్వమైనట్లుగా పుష్టిగా ఉంటుంది. మృదుస్సైన సుంద్రని ముఖం. శాంతరస మొలుకునట్టి నుదురు. పెదవులు ఆనంద రసతరంగిణికి ఎల్లలుగా యీవలిగట్టు ఆవలి గట్టుగా కన్పిస్తాయి. బౌద్ధధర్మము యొక్క ఆంతరంగిక స్వరూపం ఆ విగ్రహంలో వెల్లడిఅవుతోంది. మానవుడు సంకల్పసిద్ధుడైనప్పుడు నిర్వికల్ప స్థితినిపొంది నప్పుడు చెక్కు చెదరని ఉక్కుముక్క అవుతాడు. శరీరంకూడా ఆత్మబలంవల్ల అచంచలం అవుతుంది. అటువంటి సిద్ధుని యొక్క అవస్థను అమరత్వమును వ్యక్తంచేసే సాత్విక కాయమును బుద్ధవిగ్రహశిల్పంలో మన పూర్వులు చూపించియున్నారు. ఆ శిల్పకళకూడా నిర్వికల్పావస్థ పొందింది.

అందాకా ఎందుకు? రాములవారి విగ్రహం చూడండి. రాముడంటే రావణాసురుని సంహరించినసూర్యవంశపురాజు. మహాయోధుడు. విలువిద్యలో ఆయన కెదురు నిలువగలవాళ్లు లేరు. రామబాణం అంటే అది ఆయనపేర రిజిస్టరయిన పేటెంటు బాణం. ఎవ్వరూ ఎత్తలేని అతిభారమైన శివునివిల్లును అవలీలగా ఎత్తి తన సత్తా చూపించాడు. అటువంటి మహాబలశాలి అటువంటిమహాయోధుడు. అటువంటి విలుకాడు. నిజంగా కండలుతిరిగి ఎంతో ఘట్మస్తిగా ఉండాలి. కోడిరామమూర్తిగారికంటె మహా బలశాలి కోదండరాముడు అని మనం ఊహించుకోవలసి ఉంటుంది. కాని, మన భారతీయకళలో శ్రీరాముణ్ని వస్తాదుగా చిత్రించలేదు. గ్రీకుదేశపు పాశ్చాత్య శిల్పపద్ధతిలో అయినట్లయితే, నిజంగా గొప్ప బలశాలిగా రామవిగ్రహం చెక్కి, ఆవిగ్రహం చెక్కిన గ్రీకుశిల్పి లోకాభిరాముడయ్యేవాడు. కాని, భారతీయులు అటువంటి క్షత్రియయోధుని బాహ్యదేహ సౌష్ఠవాన్ని ఆరాధించలేదు. రాముడు బలశాలి అనే కారణంచేత ఆయన అవతార పురుషుడు కాలేదు. ఆ అవతార పురుషుని ప్రసన్న చిత్తమునే భారతీయులు ఆరాధించారు. శ్రీరామునియొక్క వెన్నవంటి మనస్సులో కన్నతల్లివంటి ప్రేమ ఉన్నది. రామరాజ్యం అంటేసర్వసుభిక్షమైన ధర్మరాజ్యం ప్రజలకందరికీ, తాను శ్రీరామరక్షగాఉండి గొడుగు పట్టిన ప్రభువు. ఆయన రాజ్యం సస్యశ్యామలంగా ఉంది. నేడు మన కాంగ్రెసు ప్రభుత్వపు త్రివర్ణపతాకములోని ఆకుపచ్చరంగు ఏమి సూచిస్తున్నదో యోచిస్తే మంచిది. సస్యశ్యామలంగా దేశం సుభిక్షంగా ఉండాలి. ప్రజలందరూ యీ జాతీయపతాకం క్రింద పచ్చగా ఉండాలి. నిత్యకల్యాణం పచ్చతోరణంగా దేశం వర్ధిల్లవలెనని సూచిస్తోంది. శ్రీరాముడు శ్యామల కోమలగాత్రుడని వర్ణించారు. శ్రీరాముడే మా తొలినోములపంటయని ప్రజలు ఆనాడు ఆనందించారు. అందుచేత శ్యామలాకారుడని చిత్రించారు. మన పంచవర్ష ప్రణాళికలవల్ల దేశం ధనధాన్యాల కోశం అయి, లేమి లవలేశం లేకుండాపోతే, మన నెహ్రూ మనరాజేంద్రప్రసాదులు ఘనులై నీలమేఘశ్యాములుగా అవతారపురుషు లవుతారు. అంతేకాదు. రాముడు ప్రజలకు ఆత్మారాముడైనాడు. రాముడే ప్రజలు - ప్రజలే రాముడు - ప్రజాహృదయంలోనే రాముడున్నాడు. రాముని హృదయంలోనే ప్రజాహృదయం లీనమైఉంది. ఆయన ఆనాడు ప్రజలకు తండ్రి. దేశానికి బాపూజీ - అటువంటి

## ★ కాలక్షేపం ★

ప్రజాహితపాలన చేసిన మహాప్రభువు ఆయన. అందువల్లనే రాముడు అందరికీ ఆత్మారాముడైనాడు. ఆయన ఏలుబడిలో ప్రజలకూ ప్రభువుకూ ఉండే సంబంధం జీవాత్మకు పరమాత్మకు గల ఆధ్యాత్మిక సంబంధంవలె ప్రవర్తించింది. ఎప్పటికైనా లోకం బాగుపడవలెనంటే అటువంటి రామరాజ్యం రావాలి. అందుకనే గాంధిమహాత్ముడు "రఘుపతి రాఘవ రాజారాం! పతితపావన సీతారాం! సబ్ కో సన్మతి దే భగవాన్" అని సంకీర్తన చేశాడు. నిజమైన స్వరాజ్యం కావలెనంటే, జనం రామదండుగా తయారై ఏకముఖంగా నిలువబడవలెనని మన చీరాల రామదాసు కీ॥ శే॥ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ప్రబోధించారు. "సబ్ కో సన్మతి దే భగవాన్" అనే మహామంత్రం "హూష్! మహాకాళీ" అనే మాయగారడీమంత్రం కాదని ప్రత్యక్ష నిదర్శనంగా చూపించారు. ఇంతకూ "సీతారాములవిగ్రహం అంటే జీవాత్మ పరమాత్మల అన్యోన్యాశ్రయాన్ని మూర్తీభవింపజేసేది" అనే మననం మహానుభావులైన రామభక్తులకు ఏర్పడి, వారికి అది ఉపాసనామూర్తియై, ఉత్తమగతిని చూపించింది. బమ్మెర పోతరాజు, కంచర్లగోపరాజు, కాకర్ల త్యాగరాజు మొదలైన భక్తులు ఆవిధంగా "జై! సీతారాం!" అనే ఆవేశంతో, రామనామమనే మిఠాయిని తినడమే కాకుండా, రామనామామృతమును తనివిదీర త్రాగడమే కాకుండా, రామనామ ధూమమును ఎగబీల్చి, దమ్ముపట్టి, యోగసమాధిలోకి చేరిన విరాగులైనారు. అటువంటి ఆధ్యాత్మికభావంతో శ్యామసుందరాకారునిగా లోకానికి అభయమిచ్చేడి ప్రసన్నమూర్తిగా ప్రసన్నరాఘవువిగ్రహం మనశిల్పులు తయారుచేశారు. శ్రీరాముడు కూడా *"He showed us the way"* (ఆయన మనకు మార్గం చూపించాడు) అనే భావం ఆమూర్తిలో ఉంది. గాంధిమహాత్ముడు కూడా మన భారతీయశిల్పంలో నీలమేఘశ్యాముడై దండపాణియై దండి సత్యాగ్రహ

మునకు దారితీయుచున్న మార్గదర్శకుడైనట్లు చిత్రించవచ్చు. కాని సర్వలోక మోహన మూర్తియైన మోహనదాస్ కరంచంద్ గాంధీని చిత్రించడంలో, ఆయన అంతరాత్మను, అచంచలమైన స్థాయిభావాన్ని, ఆయనలో ఉన్న ఆత్మస్వరూపాన్ని చూపించవలెనంటే, శ్రీమహావిష్ణువును శంఖచక్ర గదాధరునిగా చిత్రించిన రీతిని ఈ మోహనదాసు గాంధీ అవతారమును చర్ఖాపాణిగా చిత్రించడంలో ఎక్కువ ఔచిత్యం చైతన్యం ప్రావీణ్యం ప్రాశస్త్యం ఉండగలదని ఊహించవచ్చు.

ఏమైనప్పటికీ, మనం కోరేది, అనగా మనం చూడగోరునది, మనం గ్రహింపగోరునది, మనిషియొక్క బాహ్యాకార స్వరూప సౌందర్యంగాని, ఆకారవికారంగాని కాదు. ఆ మనిషియొక్క హృదయం ఎటువంటిది? అతనితత్వం ఎటువంటిది? అదే గ్రహించవలెనని ప్రయత్నిస్తాము.

పటాలంలో చేరేవానికిగాని, పోలీసు ఉద్యోగంలో చేరేవానికిగాని ముఖ్యందుగా కావలసింది విశాలమైన వక్షస్థలం. ఆరడుగుల విగ్రహం ఎత్తుకావాలి. మనిషి బరువు మణుగుల లెక్కలో ఉండాలి. స్ఫురద్రూపం, విగ్రహపుష్టి (అనగా *Personality*) ఉండాలి. చకచకా నడవాలి. పకపకా నవ్వాలి. టకటకా మాట్లాడాలి. రకరకాలుగా ముఖవికాసం చూపించాలి. ఇదంతా ప్రపంచంలో ఐహికంగా కావలసిన వేషం.

కాని, ఈ స్ఫురద్రూపం అంతా స్థిరరూపం కాదని భారతీయ తత్వవేత్తలు గ్రహించారు. దానిని వారు ఆరాధించలేదు. కాని గ్రీకులు దానినే ఆరాధించారు. వారిని అనుకరించిన పాశ్చాత్యులు ఆరాధించారు. మనిషిలో ఉండే స్థిరతత్వం ఏదో గ్రహించి దానికే సర్టిఫికెట్టు యివ్వాలని శాసించింది భారతీయ తత్వజిజ్ఞాస. అటువంటి ధ్రువపత్రాలను ఇచ్చింది ధ్రువనక్షత్రంవంటి నిశ్చలతత్వానికి. షేక్స్పియరు అనే ఆంగ్లకవి చెప్పినట్లుగా పురుషోత్తముడైనవాడు (*Constant as the Pol estar*) ధ్రువనక్షత్రం లాగున అచంచలుడై ఉండాలి. అటువంటి అచంచల ఆదికూర్మావతారమునే ఆరాధించింది మన భారతదేశం. ఎవ్వనియందు యీ లోకములు లీనమై ముడుచుకొనిపోవుచున్నవో, ఎవ్వనిలోనుంచి తిరిగి అవి బయటికి బహిర్గతమగుచున్నవో, తాబేలు అవయవములవలె ఒకమారు లోనికిపోయి మరొకమారు బయటకువచ్చుచున్నవో, అట్టి సర్వజగదాధారమైన ఆదికూర్మమొకటి ఉంది. ఆధ్యాత్మిక జిజ్ఞాసలో పడి "మూలకారణం బెయ్యది అనాది మధ్యలయుం డెవ్వడు" అని ప్రశ్నించి, తర్కించి, శోధించి, మథించి ఆఖరుకు "అట్టి ఆత్మభవు నీశ్వరునే శరణంబువేడెదన్" అని నిశ్చయించి, అటువంటిమూర్తి ఆదికూర్మమే అని నిరూపించి, ఈ ఆదికూర్మమే జగత్తుకంతటికీ ఆధారభూతమైన అచంచల స్థిరతత్వం అని ఆరాధించింది. ఆధ్యాత్మిక దృష్టి అంటే ఏమిటో లోకానికి ముష్టిపెట్టిన భారతదేశం - అందుకనే: -

"వితత జగద్భరంబు తన
వీపున దాల్చిన కూర్మనాథుడున్,
పతతము చంద్రభాస్కరుల
చక్రము ద్రిప్పు ధ్రువుండు"

వీరుమాత్రమే లోకాధారకులై లోకారాధ్యులైనవారు. (1) ధ్రువనక్షత్రంవంటి పురుషోత్తముడు. (2) ఆదికూర్మమువంటి అఖిల లోకభర్త. [(1) మహాత్ముడు (2) పరమాత్ముడు.] యింతటితో యీ జాబితా భర్తీ, - మిగిలిన మర్త్యుల జాబితా మరబ్.





సోవియెట్ యూనియన్‌లో పర్యటించిన భారతీయ సాంస్కృతిక ప్రతినిధి వర్గం.



# విషాదం

తాళ్లూరు నాగేశ్వరరావు

"లింగన్నవారి పాలెంలో వెంకటయ్య అనే వ్యక్తిని హత్య చేసిన—హంతకుని తాలూకు ఆచూకీ మాకు తెలిపినచో తగిన బహుమానం ఇవ్వబడును" పత్రికలో పోలీసువారి ప్రకటన.

హెడ్‌మిస్ట్రెస్ అయిన మరియమ్మ కళ్లు ఆ ప్రకటనమీద పడ్డాయి. రెండుసార్లు చదువుకుంది, ఆ ప్రకటన.

ఆమె చేతిలోని పేపరు జారిపోయింది. గుండెలో దడ - ఆమె శరీరాన్నంతటినీ స్వేదంలో ముంచివేసింది. మళ్ళీ ఆ ప్రకటన చూసేందుకు ధైర్యం చాలలేదు.

గోడమీద గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

ప్రేం కుర్చీలో కూర్చున్న మరియమ్మ మెడను ప్రక్కకు ప్రేలాడవేసింది. ఆమెను అంతలో అంతులేని నీరసం ఆవరించింది. కాని మనస్సులోని ఆరాటం, హృదయంలో కోత, శరీరంపైన చెమట—తగ్గలేదు.

"అమ్మగారూ, అట్లా ఉన్నారేం?" పనిమనిషి జక్రమ్మ మాటలకు ఆమెలో ఎటువంటి చలనమూ కలగలేదు.

"అమ్మగారూ! అమ్మగారూ!" జక్రమ్మ ఆమె భుజాలమీద చేయివేసింది. అవి చల్లబడి ఉన్నాయి. జక్రమ్మకి అమితమైన గాబరాపుట్టింది. వెంటనే ఫోను దగ్గరకు పరుగెత్తింది.

మరియమ్మకు కొంచెంగా స్పృహ వొచ్చింది. వంగిన మెడను సరైన స్థితిలోకి తెచ్చుకుంది. జక్రమ్మ ఫోను వొదిలి అమ్మగారి దగ్గరకు పరుగెత్తుకొచ్చింది.

"ఏమండి? వొంట్లో ఎలాఉంది? అట్లా ఉన్నారేం? డాక్టరుగారికి ఫోను చేయమంటారా?" గాబరాగా అడిగింది ఇన్ని ప్రశ్నలూ.

"ఏంలేదు, తలలో ఏదో చెదిరినట్టు ఉంటేనూ - అంతే! నువ్వు పోయి పని మాసుకో" అన్నది మరియమ్మ పేలవంగా.

జక్రమ్మ ఏదో మాట్లాడాలని నోరు విప్పబోయింది కానీ - ఎందుచాతనో మళ్ళీ లోపలకు వెళ్ళిపోయింది.

మరియమ్మ పైటచెంగుతో ముఖాన్నంతటినీ తుడుచుకుంది.

లింగన్న పాలెంలోని వెంకటయ్యను హత్య చేసింది - ఎవరు?

ఎవరు?

ఎవరు? ఎవరు?......

అంతరాత్మలో ఎవరో గట్టిగా అడుగుతోన్నట్టుంది, ఆ ప్రశ్న.

వెంకటయ్యని హత్యచేసింది ఎవరు?

ఏమో...తనకేం తెలుసు? తనకెందుకు తెలియాలి? ఆ హత్యచేసినవాడికీ - తనకూ ఏం సంబంధం? తనకెందుకు హృదయంలో ఈ కోత! ఏదో జరిగిపోయింది.. ఎవరో చంపారు! ఎవరు! తనకు తెలుసు! తను కళ్ళారా చూసింది. ఈవిషయం తన ఒక్క తెకుతప్ప లోకంలో మరెవ్వరికీ తెలీదు. కాని ఈ విషయాన్ని తను ప్రాణంకంటె భద్రంగా దాచాలి! ఎవ్వరితో చెప్పరాదు. కొన్ని జీవితాలు నాశనమవుతాయి...

...తనకు చెప్పవలిసినఅవసర మేముంది? తనని ఎవరు అడుగుతారు? ఆ హత్యా రహస్యం తనకి తెలిసినట్టు - ఆహత్య చేసిన వాడికితప్ప మరెవ్వరికీ తెలీదు. తనమీద విశ్వాసంతోనే వాడు బ్రతుకుతున్నాడు.

కొంతమందికి ఇరకోవ్యక్తిమీద అనుమానం ఉంది. వాడు పరారీ అయినట్టు వినికిడి. కాని అసలు హత్యచేసిన వాడు బాగానే ఉంటున్నాడు. బాగానే ఉండాలి!

అసలు ఎందుకు చేశాడు హత్య.

మంచికా! చెడుకా?

తనకు తెలీదు. తనకు వాడు చెప్పలేదు, ఎంత అడిగినా - రహస్యం చెబుతానని బెదిరించినా?

ఈ రహస్యాన్ని తను ఎందుకు చెప్పగూడదు? కాని - ఎట్లా? హత్య చేసినవాడు ఎవడు? తనకి దగ్గర సంబంధం కాదూ—

...తన తమ్ముడే! అవును......తన తమ్ముడే హత్యచేశాడు! తను చూసింది,- వడిచివెళ్ళే వాడ్ని వెనగ్గా వొచ్చి కత్తి పెట్టి పొడవడం! ఆ అరుపులు కూడా తను విన్నది. ఎంత దారుణం? ఎంత ఘోరం? ఎంతహింస? ఎంత నిర్దయ? మనిషిని మనిషి చాటుచేసికొని చంపడమా?...తమ్ముడు! ఆ ఒక్క బంధమే తనలో యీ మానసిక వ్యథను తెచ్చిపెట్టింది.

తనలో ఎంత స్వార్థం? విధినే ఎదిరించటానికి ప్రయత్నిస్తోంది. నేరంచేసినవాడికి తగిన శిక్ష పడకుండా చేస్తోంది.

తమ్ముడు...జైల్లోకిపోతే, ముగ్గురు పిల్లల సంసారం ఏమవుతుంది? ఆ పసికందులకు రక్షణ ఎవరూ? వాళ్ల పెంపకం ఎట్లా? భార్య మంగళసూత్రాన్ని తాను త్రెంచినట్లు అవుతుంది. పిల్లల చేతులకు తను భిక్షాపాత్ర ఇచ్చినట్టు అవుతుంది. తను చెప్పగూడదు...ఆ రహస్యాన్ని తను జీవితాంతం రహస్యంగానే దాచాలి. ఆ రహస్యం తన జీవితంతోనే అంతంకావాలి.

ఆ నిశ్చయం హృదయంలో ఏర్పరచుకున్నాక మరియమ్మ కుర్చీలోంచి లేచింది.

*　　*　　*

'మానవజన్మ ఎత్తినతరువాత - ఈ లోకం నుంచి నిష్క్రమించేవరకూ, జీవితపథంలోని తప్పొప్పులను, న్యాయాన్యాయాలను, ధర్మాధర్మాలను, పాపపుణ్యాలను, హింసాహింసలను కనిపెట్టే ఒక మహా వ్యక్తి ఉన్నాడనీ, ఆయనవల్లనే లోకం నడుస్తుందనీ - తెలుసుకొని బ్రతుకును గడపటం అవసరం' అనుకుంది మరియమ్మ రెండునెలల అనంతరం చావుబ్రతుకుల్లో ఉండి.

రెండు రోజుల క్రితం మరియమ్మ ఒక కారు ప్రమాదానికి గురియైంది. బలమైన గాయాలు తగిలాయి. ఆమెకు బ్రతుకుమీద నమ్మకం జారిపోయింది.

జక్రమ్మ ప్రక్కనే నిలుచోని అమ్మగారివంక దిగులుగా చూస్తోంది.

భవనం బయట విద్యార్థినులు చాలామంది వేచిఉన్నారు, హెడ్‌మిస్ట్రెస్ గార్ని చూచేందుకు. కాని చూచేందుకు వీలుపడదని చెప్పడంచాత దిగాలుపడి కూర్చున్నారు. పంతులమ్మలు మటుకు చూసి వెళుతున్నారు.

...మరియమ్మ మెల్లగా కళ్లు తెరిచి ప్రక్కనున్న జక్రమ్మవంక చూసింది—

"ఎట్లా ఉంది అమ్మగారూ!" జక్రమ్మ ఆరుర్దాగా అడిగింది.

మరియమ్మ సమాధానం చెప్పలేదు. ఆమె కళ్ళనుంచి నీళ్లు కారనారంభించాయి. జక్రమ్మ గుండె టపటపలాడింది. ఆమె కళ్లనుంచికూడా నీళ్ళు కారనారంభించాయి—

...తను బ్రతకదు! ఈ లోకంలో తనకి గింజలు లేవు. ట్రెయినింగు కాలేజీ, విద్యార్థినిలూ, .... తను విడిచిపోవల్సిందే! తనకి ఈజన్మ కొద్ది గంటలతో ఆఖరు...గాలిలో దీపంలాగ తనప్రాణం కొట్టుకులాడుతోంది,- యాభైఅయిదు సంవత్సరాల జీవితంలో తను సాధించిన ఉత్కృష్ట ప్రయోజనం ఏమిటి? అనాధబాలికలకు చదువు చెప్పించడం - వాళ్ల భవిష్యత్తుల్ని తేలికపర్చడం, జీవితంలో ఒకమార్గం చూపించటం!



రాత్రి కాపలా
ఫొటో : బి. రవీంద్రనాథ్—గుంటూరు.

...లోకంలోని నీతి న్యాయాలను గురించీ, సంఘపు పోకడను గురించీ, బ్రతుకు బరువును గురించీ, మతాన్ని గురించీ - తను విద్యార్థినులకు ఎన్నో ఉపన్యాసాలిచ్చింది. ఒక ఆశయంకోసం, లక్ష్యసాధనకోసం - తను ఇన్నాళ్లూ జీవితాన్ని గడిపింది ... కాని, త్వరలో జీవితాన్ని ముగించబోతోంది -

ఆమె కళ్లువిప్పి ఎదురుగా గోడపైన చూసింది. ఏసుక్రీస్తు ప్రభువు చిత్రం! సజీవంగా చూస్తోన్నట్లు అగపడింది. ఆమె హృదయంలో అకస్మాత్తుగా ఏదో భయపు తెర ఆవహించింది.

......తను...తను ఏం న్యాయం ?... స్వార్థంతో ఒక వాస్తవాన్ని కప్పిపుచ్చింది. ... 'తమ్ముడు' అనే బంధంతో ఆత్మలో వంచనకు తావిచ్చింది. తనని ప్రభువు క్షమిస్తాడా?... హృదయంలో సుప్రసరించబడ్డ...యీ... రహస్యంతోనే తను చావవలసిందేనా! - పాపంకదూ! హృదయంలో ఇటువంటి కొరత పెట్టుకొని - తను చావడం సబబు?

...కాని ఇప్పుడు తను రహస్య చెబితే తమ్ముడి గతి ఏమిటి? భా పిల్లలు - ఏమవుతారు?...వాళ్ళ గతికి కారకురాలా? నేరం చేసినవాడికి పడవల్సిందే! విధిని తప్పించటానికి ప్ర త్నించటానికి తనకి అధికారం ఏముం ...మానసిక వ్యధతో, హృదయంలో నంతో - తను చావలేదు. అట్లా చావ

# నిషాదం

...వల్ల చనిపోయే తన హృదయానికి శాంతి ఉండదు...ఏసుక్రీస్తు ప్రభువు ఎదురుగ్గా - తను హృదయంలో ఒక నీచాన్ని భద్రపరుచుకొని చావడమా?...తను చెపుతుంది, తనకి చావబోయే ముందు హృదయం పవిత్రంగా ఉండటమే కావాల్సింది - ఈ లోకపు బాంధవ్యాలూ, విచారాలూ, మమతలూ, స్వార్థాలూ - అన్నీ విడిచి ఆఖరి క్షణంలో హృదయాన్ని నిర్మలంగా చేసికొని - ఏసుక్రీస్తు ప్రభువువంక చూస్తో చనిపోవడమే తనకు కావాల్సింది. తను చెపుతుంది, ఆ రహస్యం...

"జ-క్ర-మ్మా" అతి కష్టంమీద పిల్చింది మరియమ్మ.

జక్రమ్మ—"ఏమి టమ్మగారూ!" అని ముందుకు వచ్చింది.

"పోలీసు సబ్ ఇనస్పెక్టరును రమ్మని ఫోను చేయి."

జక్రమ్మకు అర్థం కాలేదు. కాని ఆ స్థితిలో అడిగి కారణం తెలుసుకోనేందుకు ఆమెను కష్టపెట్టదలచుకోలేదు. జక్రమ్మ ఫోను చేసింది.

అప్పటికీ మరియమ్మ మనస్సు శాంతిని పొందలేదు. కాని ఒకవిధమైన తృప్తిని పొందింది.

మరియమ్మ తమ్ముడు జాకోబ్ వొచ్చాడు, ఆదుర్దాగా - అక్కయ్యను చూసేందుకు. తమ్ముణ్ని చూడగానే మరియమ్మ మనస్సు మరీ కలవరపడింది. కడుపులో తెమిలినట్లయింది. కళ్లు గట్టిగా మూసుకుంది.

"అక్కా! ఎట్లా ఉంది?" మంచందగ్గర కూర్చున్నాడు.

మరియమ్మ కళ్లనుంచి నీళ్లు కారుతున్నాయి. జాకోబు గాబరాపడ్డాడు.

పోలీసు ఇనస్పెక్టరువస్తాడు. తను ఎట్లా చెబుతుంది? తమ్ముణ్ని ఇక్కడే - తనకళ్ల ముందే అరెస్టు చేస్తారు. తను ఎట్లా చూస్తుంది? కాదు...తన తమ్ముడు ఇక్కడ ఉండకూడదు...

"తమ్ముడూ ... నీకు ... బ్రతుకుమీద ఇంక ఆశ... లేదురా!...నీభార్యనీ...పిల్లల్నీ ఒక్కసారి...మనసారా చూడాలని ఉంది. తీసుకురావూ ... " అన్నది మరియమ్మ బాధగా.

జాకోబు కంటితడిచేసికొని వెళ్ళాడు. జాకోబు మేడమెట్లు దిగి వెళ్ళిన మూడు నిముషాలకే సబ్ ఇనస్పెక్టరు మోటరు సైకిల్ మీద వచ్చాడు.

జక్రమ్మ కుర్చీ తెచ్చి వేయగా - కుర్చీలో కూర్చున్నాడు,మరియమ్మ మంచంప్రక్క. చావుబ్రతుకుల్లోఉన్న మరియమ్మ-ఎదురుగ్గా గోడమీదఉన్న ఏసుక్రీస్తు ప్రభువు చిత్రం వంకచూసింది. ఆమె గుండె వేగంగా కొట్టుకో ప్రారంభించింది. బ్రతుకుమీద నమ్మకంలేదు. ఆఖరిక్షణంలోనైనా హృదయాన్ని పవిత్రం చేసుకుందామని - ఆమె ఆందోళన!

"ఇనస్పెక్టరుగారూ...చనిపోబోయే వ్యక్తి చెప్పే ఒక కేసు తాలూకు వాస్తవం వినండి..." మరియమ్మ సంశయించింది.

ఇనస్పెక్టరు కనుబొమలు ఎగురవేస్తూ—

"చెప్పండి. చనిపోయేప్పుడు హృదయంలో ఎటువంటి దుష్టమైన భావమూ ఉంచకూడదని పెద్దలంటారు. వాస్తవం చెప్పండి. ఆఖరిక్షణంలోనైనా నిజం పలకండి. హృదయం శాంతిపొందుతుంది" అన్నాడు.

మరియమ్మ ఏసుక్రీస్తు ప్రభువు చిత్రం వంక మళ్ళీ చూసింది.

"లింగన్నవారి పాలెంలో. - జరిగిన హత్య తాలూకు ఆసామీ...మీకు ఇంకా తెలియలేదనుకుంటాను."

"లేదు"

"వెంకటయ్యను - చంపింది, మా తమ్ముడు...జా...కో...బ్!"

మరియమ్మ గొంతు వొణికింది. కళ్లు తేలిపోయే పరిస్థితిలోకి వొచ్చాయి. మెడ దిండుమీదకు వ్రేలాడవేసింది.

"అమ్మగారూ!" జక్రమ్మ కేకవేసింది.

ఇనస్పెక్టరు సంతోషంగా కుర్చీలోంచి లేచి వెళ్ళాడు.

* * *

మరియమ్మ చావలేదు. నెల రోజుల్లో ఆమె మామూలు మనిషైంది, గాయాలన్నీ మానిపోగా.

అమధ్యాహ్నం కుర్చీలో కూలబడి ఆలోచిస్తోంది, మరియమ్మ.

తను రహస్యం ఎందుకు చెప్పింది? తమ్ముడు - తోబుట్టువు! - జైల్లో...ఇంటిదగ్గర భార్య, పిల్లల హాహాకారాలు - తను చావక ఎందుకు బ్రతికింది! చస్తే ఈ బాధలన్నీ ఉండేవి కావుగదా! - కాని చెప్పకుండా ఉండలేకపోయింది. అప్పటి శక్తులు అట్లా పనిచేసినయ్!...ఏసుక్రీస్తు ప్రభువు తనచాత నిజం చెప్పించాడు-తన దేముంది?

"అమ్మగారూ!" జక్రమ్మ మెల్లగా అన్నది అప్పుడే బయటనుంచి లోపలకు వచ్చి—ఆమె ముఖం పాలిపోయిఉంది.

"ఏం?"

"జాకోబుగారికి...ఉరిశిక్ష విధించారట..."

"ఆఁ!..." మరియమ్మ తల కుర్చీకేసి బాదుకుంది—

'తను ఎందుకు చావలేదు? ఎందుకు చావలేదు?' కుమిలి కుమిలి ఏడ్చింది మరియమ్మ. ★

## రచయితలకు మనవి

**మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.**

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫొటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్ లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం. ఫొటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

మాకు పంపిన రచనలను, ఫొటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

# పప్పు

"తిండి కలిగితె కండగలదోయ్-కండగలవాడేను మనిషోయ్" అన్న రీతిగా ఆరోగ్యంగా బ్రతకడానికి ఆహారం ప్రధానం. ఆ యాహారం కండపుష్టి, నరాల బిగువు, ఎముకల పటుత్వం, రక్తశుద్ధి, మేధోవృద్ధి కలిగించే వస్తుసామగ్రితో, తగు పాళ్ళలో కలిపి తయారుచేసుకోవలసి వస్తుంది ప్రతిదినం. దీనినే "సమీకృతాహారం" (*Balanced Diet*) అంటారు. వైద్యశాస్త్రం ఈ సమీకృతాహారానికి లక్షణం నిర్ణయిస్తే, పాకశాస్త్రం అందుకు లక్ష్యసిద్ధిని కలిగించింది. కాబట్టి లక్ష్య లక్షణ సమన్వితమైనది మన దైనందిన భోజన విధానం. అటువంటి భోజనంలో పప్పు ప్రముఖపాత్ర వహిస్తుంది.

పప్పుయొక్క విశిష్టతకు కొంత ప్రచారం కలిగించడానికే "పప్పులేని తిండి ఫలము లేదు." అని కవివాక్యం పుట్టింది. 'మాంసాహార వివర్జితులైన ఆ కాలం బ్రాహ్మలున్నూ తమ జవసత్వాలు హరించిపోకుండా జవాన్లవలె వుండడం ఆవశ్యం కాబట్టి కండపుష్టిని కలిగించే పప్పును తప్పనిసరిగా వాడవలసిన ఆవశ్యకతను నిరూపిస్తూ, "పప్పే పస శాపలకును" అన్న అమూల్యమైన సూచనకూడా కవి కలంనుండి వెలువడింది. ఆ సూచనను తూచా తప్పక పాటించి సూపమును వాడి ఆనాటి బ్రాహ్మణులు తమ చేవను కాపాడుకోబట్టే అవసరమైనప్పుడు "ఇదం బ్రాహ్మం - ఇదం క్షాత్రం" అని కత్తిపట్టి కదనరంగంలో నిలిచినారు. "వేడని కందిపప్పు, అవివేకుని మెప్పు" పనికిరాదంటూ మరొక కవిశేఖరుడు పప్పును పక్వంచేసే విధానంలోని మెలుకువను చాటి చెప్పినాడు. ఇంకొక కవికి ఏ కారణంచేతనో ఆహారలోపం జరిగింది. తత్కారణంగా అతడు తన కడుపుమంటను "ఉడికీ ఉడకని కూరలు, కాటోయిన కందిపప్పు కాలని చారున్, గోడ్డలికే మెదగని బూరెలు, సిద్దెలతో మురికి నెయ్యి సీతారామా!" అని బయట పెట్టుకొన్నాడు. కవిత్వం చెబితేగాని భోజరాజు దగ్గరనుండి భోజనానికి కానీ కూడా కంటబడే ఆస్కారం లేదు కాబట్టి "భోజనం దేహి రాజేంద్ర! ఘృత సూప సమన్వితం" అని అన్నార్తుడైన అభాగ్య కవి యొకడు కష్టరీ కవిత్వంతో తయారైనాడు. దీన్నిబట్టి ఆ కాలంలో భోజనంకూడా పప్పూ, నెయ్యి, పెరుగూ లేకుండా జరిగేదికాదని తెలుస్తుంది. నేటి పరిస్థితి చూడబోతే పప్పూ, నెయ్యి కాదుగదా, అన్నం మెతుకులకే సామాన్య కుటుంబీకుడు అల్లాడిపోతాడు. అతని సంపాద్యం అన్నంవరకే చాలీచాలక పోవడం మూలంగా చివరకు "అప్పుసొప్పూచేసి పప్పూ ధప్పళం కొడతాం మురా!" అన్న పరిస్థితి కలిగింది. "తెలుంగన్ తిన్న కెట్టాన్" (తెలుగువాడు తిని చెడ్డాడు) అనే అరవసామెత కూడా అందుకే పుట్టింది.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

## 'చదలవాడ'

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

శుభానికీ అశుభానికీ గూడా పప్పు వండక తప్పదు. "ఏరా! పెండ్లి పప్పన్నం ఎప్పుడు?" అని బ్రహ్మచారులను అడగడం మామూలు. వివాహాది శుభకార్యాలలో, పండుగలు, పబ్బాలలో పంచభక్ష్య పరమాన్నాలు వండినా, ప్రథమంగా వడ్డింపబడే గౌరవం పప్పుకే దక్కింది. "పప్పులేని పెండ్లా?" అనే సామెతకు అదే కారణం. అశుభ కార్యాలలో పెసలపప్పు వాడడం పరిపాటి. అందుకే "పెసలపప్పు పెండ్లి" అంటే తద్దినానికి పర్యాయపదమైపోయింది.

తిండిపోతురాయళ్లను "పప్పు రాము" లంటాము. మనం చేసేపనుల్లో, చెప్పే మాటల్లో యేమాత్రం అశ్రద్ధ జరిగినా "పప్పులో కాలు వేయడం" తప్పదు. "అంద పరుప్పు యింగే వేగాదు" (ఆ పప్పులు ఇక్కడ వుడకవు) అంటూ అరవలు ప్రయోగిస్తారు. తెలివితేటలు గలవారివద్ద ఎవరెన్ని ఎత్తులు వేసినా "పప్పులు వుడకవు"-పాచిక పారదు. "వాడేం పెద్ద పప్పు గనకనా?" అని ఎదుటివారిని చులకనచేసి మాట్లాడడం మనకు మామూలు.

పిల్లవాండ్లకు ప్రీతికరమైన వస్తువులు "పప్పుబెల్లాలు" "అయ్యవారికి చాలు అయిదువరహాలు, పిల్లవాండ్లకు చాలు పప్పుబెల్లాలు" అనే మహార్నవమి పద్యం దీనికి మహత్తరమైన నిదర్శనం. సాధారణ నూనెకన్నా "పప్పు" నూనె ప్రశస్తమైనది. వయసు మళ్ళిన పెద్దల ప్రస్తావన వచ్చినప్పుడు వారిని "కాలాలనాటి కందిగింజ" తో పోలుస్తాము.

"అనగా అనగా అనుములపల్లె, అనుములపల్లెలో మినుములపల్లె, మినుములపల్లెలో కందులవారి వీధి, కందులవారి వీధిలో పెసలవారిల్లు, పెసలవారింటి వాకిట్లో పెద్దచెట్టు, పెద్దచెట్టుమీద కోతి, కోతికి సమానం అబ్బాయి మూతి." అని అమ్మమ్మలు కథలు చెప్పడం అలవాటు.

పాకశాస్త్రంలో పప్పుకు ప్రాముఖ్యత ఎక్కువ. పప్పన్నంతోనే భోజనం ప్రారంభం అవుతుంది. కూరల్లో పప్పువేసి తాలింపు చేస్తారు. పప్పుతో పచ్చళ్ళు చేస్తారు. పచ్చళ్ళంటే, పైపైకి ఏవంగిచుకొంటూ, వుత్తరాదివారిని "పచ్చడి ముద్దలు" అని హేళనచేసే దాక్షిణాత్యులున్నూ, నాలుగు పప్పులతో నాణ్యంగా పచ్చళ్ళు నూరుకొంటారు, రుచిగా తింటారు. అందులోనూ పెసలపప్పునాననిచ్చి రుబ్బి తయారుచేసిన "పచ్చి పెసల పచ్చడి" లో ఇంగువపాలు, నిమ్మపండ్ల రసం చేర్చి పోపుకూడా పెట్టి వాడితే ఆ రుచి తిన్నవారికేగాని విన్నవారికి తెలియదు. అటువంటి పచ్చిపెసల పచ్చడిని అచ్చమ్మ అనే గృహిణి ఆదర్శప్రాయంగా తయారుచేయగా ఆరగించిన ఒకానొక ఆంధ్ర కవిశేఖరుడు తన ఆనందాన్ని "పచ్చిపెసలపచ్చడీ-ఇచ్చలో భుజింపుడీ-అచ్చమ్మ నూరిన పచ్చిపెసలపచ్చడీ - హెచ్చుగా భుజింపుడీ!" అని పాడి అచ్చమ్మకూ, పచ్చిపెసల పచ్చడికీ కవితా ప్రాశస్త్యం కలిగించినాడు.

అయితే, కందిపచ్చడి వినడానికి, అంతకన్నా తినడానికీ, తేలికగా కనిపించినా దానిని తయారుచేయడంలో చాలా మెళుకువలు వున్నవి. వంట నేర్పును పరీక్షించడానికి ఒరిపిడి రాయివంటి వస్తువు కందిపచ్చడి. పొరపాటున ఒక్కగింజ ఎక్కువ మాడితే కమురుకంపు - తక్కువగా వేగితే పచ్చివాసన - పచ్చడికి తప్పవు. అటూగాక, ఇటూగాక ఉభయమధ్యస్థంగా తయారుచేయవలసిన వస్తువు కందిపచ్చడి. లేకుంటే వుభయభ్రష్టత్వంగా పరిణమిస్తుంది. కాబట్టి కొత్తగా వచ్చిన కోడ

# ★ పప్పు ★

ళ్ళకు కందిపచ్చడి నూరి మెంతులు పులుసు తయారుచేసే పని కల్పించి వారి పాకశాస్త్ర ప్రావీణ్యం పరీక్షిస్తారు దక్షిణాది అత్తలు. నిజానికి కందపద్యం చెప్పడంలో ఎంతకష్టంవుందో కందిపచ్చడి తయారుచేయడంలోనూ అంత కష్టంవుంది.

పప్పులేకుంటే "సాంబారు" లేదు. కన్నడిగలకు కడుప్రీతికరమైనది "బిసిబేళా హుళి." (వేడివేడి పప్పుపులుసు) వారికి ప్రీతికరమైన "హోళీ"లకు పూర్ణం ప్రధానం. ఆ పూర్ణం శెనగపప్పుతో తయారవుతుంది. "మైసూర్ పాక్"కు శెనగపిండి ముఖ్యం. "మైసూరు బోండాకు" వుద్దిపప్పు కావాలి. "మైసూరు రసం"లోని రుచికి పప్పే ప్రధానం.

"పప్పుచారం"టూ కొందరు ఒకటి తయారుచేస్తారు. నిజానికి అది పప్పుచారు కాదుగాని తదాభాస మాత్రమే. పప్పు వుడికేటపుడు నీరువంచి ఆనీటితో తయారుచేసే ఆ చప్పిడి చారును పప్పుచారు అనవలెనో లేక అప్పుచారు (నీరు) అనవలెనో తెలియడంలేదు.

పరమాన్నం పెసలపప్పుతో వండుతారు. లేక మరేవస్తువుతో పరమాన్నం వండినా అందులో ముంతమామిడిపప్పు మాత్రం తప్పదు. లేకుంటే పాకశాస్త్రం ఒప్పదు. బాదంహల్వా, బాదాంకీర్ వగైరాలు బాదంపప్పుతో తయారయ్యే వస్తువులు. వడలలో పప్పులు కలియకుంటే వాటం లేదు. "వడపప్పు" అనే మరోరకం వస్తువు కద్దు. కాని, దానికీ వడలకూ ఏమాత్రం సంబంధంలేదు. ఎండాకాలంలో వడదెబ్బ తగలకుండా తాపోపశమనం కలగడానికి ఆస్వాదించే వస్తువు "వడపప్పు." మినపపప్పును మినహాయిస్తే ఇడ్లీ, దోశెలకు ఆరూపం, రుచి అసలేరాదు. "ఇనపరొట్టె" అనే అన్వర్థనామంతో చెలామణీ అవుతూ "దిబ్బరొట్టె" అని కొన్ని ప్రాంతాలలో పేరందిన "మినపరొట్టె" ఆంధ్రుల అభిమాన ఫలహారం. ఈ మినపరొట్టెతోబాటు మినపసున్ని కూడా ఆంధ్రులకు ప్రీతిపాత్రమైనది. ఆంధ్రత్వానికి అలంకారప్రాయమైన అన్నంలోపొడి నాలుగు పప్పుల సాన్యామైన సమ్మేళనం. ఆంధ్రులు సిసింద్రీల వంటివారు. వారికీ యీ *Gun-Powder* కు (అన్నంలో పొడికి బిరుదుపేరు) అంత సామరస్యం! దీనిని అరవలు "పరుప్పుపొడి" అంటారు. అప్పడాలు, వడియాలకు పప్పులు ప్రధానం. గుగ్గిళ్లకు ముడిశెనగలు ముఖ్యం. పేరుగన్న "పెసరట్టుకు" పెసలపప్పు ముఖ్యం అన్న విషయం ఆ పేరులోనే స్ఫురిస్తుంది. వేరుశెనగపప్పులు, బటానీపప్పులు, అలసందపప్పులు, అనపపప్పులు మనం అప్పుడప్పుడు వాడుతాము.

బియ్యం, పప్పు కలిపి వండితే పులగం అవుతుంది. పులగం తినేవారికి ప్రత్యేకంగా పప్పువడ్డించేపనిలేదు. అథవా వడ్డిస్తే అది "పులగంమీది పప్పు"గా పరిణమించి వుపేక్షింపబడవచ్చునుగూడా. పచ్చిపప్పులు నానించి, కొబ్బెర తురిమిచేర్చి విందుల సందర్భంలో విస్తళ్లకు అలంకారప్రాయంగా వడ్డిస్తారు. దానికి "కోసిమిరి" అని పేరు. కొద్దిగా బియ్యం, కొన్ని పప్పులు చేర్చి నూరి వుండలుచేసి చారుతో పక్వంచేసి "చారుంటలు" లేక "పప్పుంటలు" అని వాడుతారు.

కష్టమైనశైలిని "ఇనపగుగ్గిళ్లు"అంటాము. అదేవిధంగా తమిళంలోనూ కటువైనభాషను "పొరువిళంగా వురుండై" అంటారు. వేయించిన పెసలపప్పును పిండిచేసి బెల్లం పాకంలో కలిపి పట్టిన వుండలు "పొరువిళంగా" వుండలు. చక్కిలాలు, మణుగుపూలు (జంతికలు) పాలకాయలు, పప్పుతో తయారయ్యే ఫలహారాలే. మనంవాడేతిండ్లు చిరుతిండ్లు వగైరాలలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పప్పుతో సంబంధం కద్దు. వినాయకచతుర్థినాడు కుడుములు, వుండ్రాళ్లు మొదలగువానిలో పప్పు పూర్ణం చేరుస్తాము. చివరకు పూజాసందర్భంలో వినాయకుణ్ణి, "ఉండ్రాళ్లు, పప్పు, నెయ్యిని జుండ్రించిన చెఱుకుపాలు బడియపుట్లుకా జుండ్రేచు పచ్చితేనియతండ్రీ! జనకయ్య నీకు తడయకనిత్తుకా." అని ప్రార్థిస్తాము. అందుచేత వినాయకునికి ప్రీతికరమైన వస్తువులలో పప్పుకూడా ఒకటి అని తెలుస్తుంది. అందుకని తమిళంలోనూ ఇదేభావం గల ప్రార్థనలో "పాలుం, తెళితేనుం, పాగుం, పరుప్పుం, ఇవైనాన్గుం కలందు నానుక్కుత్తరువేకా" అని వుంది. తెలుగుపద్యంలో వుండ్రాళ్లు పప్పు నెయ్యి వగైరాలను వినాయకునికి అర్పిస్తాననిమాత్రం అన్నాడు కవి. అరవంలో అట్లాకాదు. తను యిచ్చిన వస్తువుల మొత్తం లెక్కచెప్పి (ఇవై నాన్గుం కలందు నానుక్కుత్తరువేకా) ఇదులకు భాషావరంకూడా కోరేటట్లు చెప్పబడివుంది. పై పద్యంలోని తర్వాతి పాదంలోని "కోలంశెదు కరిముగత్తుత్తూమణియే! నీ యెనక్కు సంగత్తమిళ్ మూన్రుంతా!" (ఓ గజముఖుడా! నీవు నాకు సంగం యుగంలో ప్రఖ్యాతిగాంచిన త్రివిధములగు భాషాశైలులను ప్రసాదించు! అని తాత్పర్యం) అన్నమాటలే అందుకు తార్కాణం. అరవలకూ, ఆంధ్రులకు ఏవిధమైన ఆశయభేదాలు కలవన్నదీ దీని మూలంగా తెలుస్తుంది.

పప్పును పలువిధాలుగా వాడినా తృప్తిచెందక మనము భోజనానంతరం కూడా సారెపప్పు, దోసపప్పు కలిసిన వక్కపొడితో చేర్చి తాంబూలం సేవిస్తాము. అంతకూ చాలకుండా, రాత్రి పడుకోబొయ్యేటప్పుడు బాదంపప్పు, పిస్తాపప్పు నూరి కలిపి కాచిన పాలు త్రాగుతాము.

ఆకు కూరల్లో ఒకదానికి "పప్పాకు" అని పేరు. "కందులవారు, పెసలవారు" అనే యింటిపేర్లున్నా కద్దు. సుగంధద్రవ్యాలతో చేర్చి పెసలపప్పును విసిరి పిండిచేసి సున్నిపిండి తయారుచేస్తే సున్నితమైన వాసన వేస్తుంది.

"శరీరమాద్యం ఖలుధర్మసాధనం" అన్నట్లు శరీరపోషణ ప్రతివారి కనీసధర్మం. అందుకు తిండి ముఖ్యం. కండపుష్టి నిచ్చే శక్తి పప్పుల్లో అఖండంగా వుందని పరిశోధనలు జరిగి ప్రయోగపూర్వకంగా ప్రముఖులు కనుగొన్నారు. కాబట్టి "తిండి కలిగితె కండ గలదోయ్ కండ గలిగినవాడె మనిషోయ్" అన్న గురజాడవారి అడుగుజాడల్లో నడవదలిస్తే అందరూ తప్పనిసరిగా పప్పు తినవలిసిందే. తినకుంటే తప్పు. కాని మితిమీరి తింటేమాత్రం ముప్పు. మితంగా వాడితే మెప్పు. ★




## సచిత్ర వారపత్రిక

# సంక్రాంతి సంచిక కథానికల పోటీ

## మొదటి బహుమతి రు 75. రెండో బహుమతి రు 50.

వచ్చే సంక్రాంతికి (14-1-1955) ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. ఈ సందర్భం పురస్కరించుకుని కథానికలపోటీ జరుపుతున్నాము. పోటీకి వచ్చే కథానికలలో ప్రథమ, ద్వితీయశ్రేణి రచనలకు రు 75, రు 50 బహుమతు లివ్వబడతాయి.

నేటి మనసామాజిక వ్యవస్థలో స్త్రీల స్థితిగతులు, వారి మనఃప్రవృత్తి, వా రెదుర్కొంటున్న సమస్యలను గురించిన కథానికలు మాత్రమే పోటీకి స్వీకరించబడతాయి. పోటీలో అందరూ పాల్గొనవచ్చును.

**పోటీ కథానికలు మా కార్యాలయానికి 1954 డిసెంబరు 1 వ తేదీలోగా చేరాలి. పోటీకి ప్రవేశరుసుము లేదు.**

పోటీకి పంపే కథానికలకు కేపర్లపైనా, రచన మొదటిపుటపైనా స్పష్టంగా "ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక సంక్రాంతి కథానికలపోటీకి" అని వ్రాయాలి.

బహుమతి నిర్ణయం అనంతరం ప్రచురణకు స్వీకరించబడని రచనలను తమకు త్రిప్పి పంపగోరే రచయితలు తిరుగుపోస్టుకు అవసరమైన స్టాంపు తమ రచనలతోబాటు జతపరిచి పంపాలి.

సంక్రాంతిసంచికకుగాను ఇతరవ్యాసాలు, కథానికలు, చిత్రాలు, ఫొటోలు పంపదలచిన వారుకూడా 1954 డిసెంబరు 1-వ తేదీలోగా తమ రచనలు మా కార్యాలయానికి అందేటట్లు పంపాలి.

రచయితలందరూ, ముఖ్యంగా వనితలు ముందంజవేసి కథానికల పోటీలో పాల్గొని మా సంకల్పాన్ని జయప్రదంగా నెరవేర్చగలరని ఆశిస్తున్నాము.

—సంపాదకుడు.

రామనాథం గోదావరీతీరాన కూలబడ్డాడు. నది కింకా నీళ్లురాలేదు. మన మనస్సుప్రకారం ప్రకృతికూడా పరివర్తన చెందుతుందిగాబోలు. నిదాఘ నది మల్లేనే వుంది తన జీవితం! కానీ నదికి వచ్చినట్లు ఈ జీవితాని కెప్పుడూ పుష్కలంగా నీళ్లు రావు. నదికిమల్లే ఈ జీవితం ఎన్నడూ పూర్తిగా ఎండిపోదు. ప్రొద్దుగూకి పోవచ్చింది. ఎంత తప్పించుకు తిరుగుదామన్నా మానవుడు ప్రపంచాన్నించి పరంగా తిరగలేడు. తప్పదు, చెయ్యని సంకెళ్లు తనకూ ప్రపంచానికీ వున్న సంబంధాలు. ఇంటిదగ్గిర బావుండకే కొంచెం సేపన్నా మనస్సు స్థిమితంగా వుంటుందని ఇలా వచ్చాడు. నారాయణ విశాఖపట్నంలో ఆనర్సు చదువుతున్నాడు. రెండో సంవత్సరం జీతం కట్టడానికి డబ్బులేదు. మానిపిద్దామంటే నిరుడు పోసిన డబ్బంతా బూడిదలోపోసిన పన్నీరవుతుంది. నారాయణ ఏదో ఆ పరీక్ష ప్యాసయితే తన బాధ్యత కొంతవరకు తీరిపోతుంది. కుటుంబాన్ని ఓదరికి చేర్చినట్లవుతుంది. కాని ఎలా? ఎంతకాలంనించి శ్రద్ధ తీసుకొంటున్నా పెన్షన్ డబ్బూ, తను టైపు మిషనుమీద సంపాదిస్తున్న డబ్బూ ఇంట్లోకే సరిపోతున్నాయి. ఎవరిదగ్గరన్నా ఓ కానీ పుట్టేరోజులు దాటిపోయాయి ఏనాడో! నారాయణని విశాఖపట్నం పంపడానికి చేసినఅప్పు ఇంతవరకూ తీర్చ లేదు. అప్పటికీ వాడిఅదృష్టం బావుండబట్టి స్కాలర్‌షిప్పుతో చదువుతున్నాడు గనక. ఒక వేపు ఆ ఇవ్వవలసిన డబ్బుకు వడ్డీ పాపం పెరిగినట్లు పెరిగిపోతూనేవుంది.

వీటన్నిటినీ పరిష్కరించేమార్గం ఒక్కటి మాత్రం వుంది. ఇంటిప్రక్క శేషగిరి - రెండంతస్థులమేడకు అధికారి, పాతికెకరాల ఆసామీ తన కెంతకావాలంటే అంత ఇవ్వగలడు. కాని ఏంలాభం? జానకిని తనకిచ్చి చెయ్యమంటాడు. చూస్తూ చూస్తూ పండంటి పిల్లను తీసికెళ్ళి ఆ రెండో పెళ్లివాడి కివ్వటం తను చేతులారా చెయ్యలేని పని. ఇక తనకు దారేమిటి? ఓ సముద్రమంత సమస్యవచ్చి ఎదురుగా నిలబడింది రామనాథానికి. తన గత ఇరవైసంవత్సరాల తాలూకా గుమస్తాగిరి జీవితమంతా సమస్యలతోనే గడిచిపోయింది. ఒకటి కాకపోతే మరొకటి! ఈ జీవితమెప్పుడో ఈ సమస్యల మధ్యే అంతమైపోతుంది.

రామనాథం లేచి మెల్లగా అడుగులువేసుకొంటూ ఇంటివేపు నడక సాగించాడు. తన ఇంటిప్రక్క శేషగిరి రెండంతస్థుల మేడ తనని వెక్కిరిస్తోంది. కానీ ఆకాశంలో ఎన్ని నక్షత్రాలున్నా చంద్రుడు లేకపోతే ఎంత కళ తక్కువగా వుంటుందో ఇల్లాలులేని ఆ మేడసహితం బావురుమంటూ వుంది. తను నుంచున్న చెట్టుక్రిందే శేషగిరి తనతో "నీ కావలసిన సహాయంచేసే బాధ్యత నాది. చన్నీళ్ళకు వేన్నీళ్ళలా తోడుగా వుండచ్చు. ఈ ఆస్తంతా ఎవరికిస్తాను గనక? చిన్నప్పట్నుంచీ ఈ యింట్లో పెరిగింది. ఇంటి విషయాలన్నీ బాగా తెలుసు తనకి. జానకిని తనకిచ్చి చెయ్యమంటాడు. ఇంత ఆస్తికి హక్కుదారిణి తన కూతురు కావడం బాగానేవుంది గానీ, - కేవలం ఆస్తేనా ముఖ్యం? శేషగిరి వయస్సెక్కడ? జానకి వయస్సెక్కడ? తన స్వార్థంకోసం కన్న

"తిరునగర్"

కూతురిగొంతు ఏ తండ్రి కొయ్యగలడు? శేషగిరిని ఆ విషయం ఎప్పుడూ ఎత్తవద్దని మందలించాడు రామనాథం!

"ఏం నాన్నా ఎక్కడన్నా దొరికిందా?" ఎదురుగా వస్తూ నారాయణ వేసిన ప్రశ్న విని తృళ్ళిపడ్డాడు. అప్పుడే తను ఇంటి కొచ్చేశాడన్నమాట. పంజరానికి అలవాటైన పక్షి ఎక్కడికి పోగలదు గనక?

"డబ్బు చూస్తున్నా! ఇంతవరకూ ఎక్కడా దొరకలేదు" అన్నాడు రామనాథం ఇంట్లోకి జొరబడుతూ.

"ఏవమ్మా జానకీ నీళ్లు తోడతావా?" అన్నాడు పైపంచె కొంకెకు తగిలిస్తూ! వంటింట్లో జానకి పిల్లలతోనూ, వాళ్ళ పేచీలతోనూ సతమతమవుతూ అన్నాలు పెడుతోంది.

"కొంచెం ఆగు నాన్నా" అంది లోపల్నించి.

రామనాథం దొడ్లోకి వెళ్లి మంచంమీద వెల్లకిలా పడుకొని డబ్బు పుట్టించేవిధానం కోసం బుఱ్ఱచించుకొని ఆలోచిస్తున్నాడు. లోపల్నించి జానకి చాలా ఆదుర్దాగా, ఇంచుమించు ఖంగారుగా "నాన్నా... ఒక్కసారిలా రాకి" అని కేకవేసింది. ఇంట్లోకి వెళ్లేసరికి భార్య సూర్యకాంతమ్మకి స్పృహ లేదు. "ఏమిటి నాన్నా? ఇలా ఎప్పుడూ రాలే దింతవరకు?" అంది ఖంగారుగా జానకి.

రామనాథానికి తన నిస్సహాయస్థితి గజ్జెలు కట్టుకొని తనముందు లాస్యం చెయ్యడం చూచి అతని కాక్షణాన ఏడుపు రాలేదుకి నవ్వొచ్చింది. ఆర్థికదుస్థితి తన నొంటరిగా చేసి ఎలా అపహాస్యం చేస్తోందో తన కర్థమైంది. డాక్టర్ని పిలుచుకొద్దామంటే? ఎవరొస్తారు? ఈ స్వతంత్ర భారతదేశంలో తనవంటి అభాగ్యుడికి కాని లేకుండా వైద్యంచేసే వాళ్లుంటే తన కసలీ సమస్యలేవీ లేకుండా పోను. డబ్బు నీళ్ళలా ధారపోసి విసిగి విసిగి కొంతకాలంనుంచీ సూర్యకాంతమ్మకు మందు లిప్పించడం మానేశాడు. పిల్లలంతా మంచంచుట్టూ చేరారు. వాంట్లో ఎవరన్నా "అలా చూస్తూ వూరుకుంటావే నాన్నా?" అని అడిగితే నిలవేసి? తనేం సమాధానం చెపుతాడు? తన మీద ఆ బాధ్యతవున్నదనే విషయం తనకూ తెలుసు. కాని బాధ్యతల్ని నెరవేర్చేందుకు సాధనమే తనదగ్గర లేదు. అంత అసమర్థుడు తన దౌర్బల్యాన్ని తెలుసుకొని కూడా అన్ని బాధ్యతల్ని ఎందుకు నెత్తిన వేసుకోవాలి? తనకు భార్య, బిడ్డలు ఎందుకు? తనేమన్నా వాళ్లని సుఖంగా పోషించగలుగుతున్నాడా? ఈ ప్రపంచంలో జన్మించడమే అసమర్థత్వం గాబోలు. ప్రకృతి అంతుల్ని తలదాల్చడమే అసమర్థత్వమైనప్పుడు ప్రపంచంలో పుట్టడం సమర్థత్వమెలా అవుతుంది? ఆ ఉబ్బసం రోగం సూర్యకాంతమ్మకు ఎంతకాలం నుంచో!

"అమ్మా....అమ్మా" జానకి తల్లిని తట్టి పిలుస్తోంది. ఆమె కంఠం ఇంచుమించు గాద్గదికమైపోయింది. సూర్యకాంతమ్మ మెల్లిగా కళ్లు తెరిచింది. రామనాథం గుండె కుదుటపడింది.

"ఎలా వుందమ్మా" అని అడిగింది జానకి తల్లిని ఆదుర్దాగా!

సూర్యకాంతమ్మ భర్తవంక జాలిగా చూచింది. రామనాథం తల వంచుకున్నాడు.

"బాగానే వుందమ్మా! మగత వచ్చింది. అంతే!" అంది తల్లి!

రామనాథం దొడ్లోకి వచ్చాడు మళ్ళా. అటూ ఇటూ రెండు మూడుసార్లు పచార్లు చేశాడు "జానకీ ఇలా రామ్మా" అన్నాడు. జానకి వచ్చింది. రామనాథం మంచంమీద కూర్చుని ఇంకో దిక్కుకి ముఖం పెట్టుకొని

"నిన్నో విషయం అడుగుతానమ్మా..." అన్నాడు.

"ఊఁ" అంది జానకి!

"కోపగించుకోకమ్మా! ఈ దౌర్భాగ్యుడి కడుపున పుట్టడమే నీ పాపమైపోయింది" అన్నాడు తండ్రి.

కూతురు తలవంచుకొని "నాకు తెలుసు నాన్నా నువ్వేవిషయం అడగాలనుకుంటున్నావో!" అంది.

రామనాథం రెండు క్షణాలసేపు మెదలకుండా వూరుకొని "నా కంతకంటె వేరే మార్గం గోచరించలేదు తల్లీ! అమ్మ జబ్బు నయం కావలన్నా, అన్నయ్య చదువు పూర్తయి ఒకదారికి రావాలన్నా, ఈ పిల్లలంతా పెరిగి పెద్దవాళ్ళవ్వాలన్నా..."

"అంతే నాన్నా! కుటుంబంలో ఎవరో త్యాగం చెయ్యడం తప్పదు. నువ్వు దానికేమీ బాధపడకు. ఇష్టం, అయిష్టం మనం నిర్ణయించుకొనేవి. ఆ పెళ్లికి తప్పకుండా ఒప్పుకో నాన్నా..." అంటూ కూతురు తుఫానులా ఇంట్లోకి వెళ్ళిపోయిం దక్కణ్ణించి.

రామనాథానికి ఒక్కసారి బావురుమని ఏడవాలనిపించింది. తనకోసం అంత త్యాగమా? ఆమె యవ్వనమంతా అడవి కాచిన వెన్నెలయిపోతుంది. కోరికలన్నీ ఎండి బండబారి మోళ్ళయిపోతాయి. కానీ...కానీ...జానకిలో ఎంత త్యాగం?

కూతుర్ని తనకు తానై అడిగినప్పుడు మండిపడ్డ రామనాథం ఇప్పుడు తనకు తానై వచ్చి ఇస్తానన్నప్పుడు ఏవిధమైన ఆలోచనా లేకుండానే జరిగివుండదు అనే విషయం గ్రహించడానికి శేషగిరికి ఆట్టే సేపు పట్టలేదు. రెండు మూడు నిమిషాలు ఆలోచించినమీదట

"సరే! అలాగే కానియ్యండి" అన్నాడు.

"కానీ ఒక విషయం" అన్నాడు కాబోయే మామ.

"ఏవిటది?"

"నే నెప్పుడెంత బాధల్లో వున్నానో మీకూ తెలుసుగా? ఆవిడ మంచందిగి ఎంత కాలమయిందో! నారాయణ ఆనర్సు మొదటి సంవత్సరమయిపోయింది. రెండో సంవత్సరం డబ్బు కట్టి కాలేజీలో చేరాలి. ఓ వెయ్యి రూపాయలు ఇప్పించాలి."

"ఇంకా ఏమైనా?" అన్నాడు శేషగిరి.

"పెళ్ళి ఖర్చులక్రింద ఓ వెయ్యి రూపాయలు...శేషగిరిగారూ ఇలా అడుగుతున్నానని మీరేమీ అనుకోకండి. ఆర్థిక దుస్థితి అలాంటిది" అన్నాడు రామనాథం!

"అచ్చే. దాని కేముందిలెండి. శేష

ట్నుంచీ ఒకరికొకరు సహాయం చేసుకోవాలి?" అన్నాడు శేషగిరి తలవంచుకొని!

జానకి పెళ్ళి వైభవంగానే జరిగింది. రామనాథానికి ఎంత పరికించినా కూతురి ముఖంలో ఏ భావమూ ఇదమిత్థంగా తేల్చి చెప్పగలిగింది కనిపించలేదు. జానకి గంభీరమైన నిర్లిప్తతవహించింది... ...

తను శేషగిరి భార్యా? శేషగిరి భార్యతో కాపురం చేస్తున్నప్పుడు తను చిన్నపిల్ల. శేషగిరి మొదటి భార్యకు తనంటే ఎంతో ముద్దు. ఇరవై నాలుగ్గంటలూ తనని దగ్గరే వుంచుకొనేది. తనకి పిల్లలులేరు. శేషగిరిని "నాన్నా, అని పిలిపించేది తనచేత ముద్దుగా! అలాటి తను శేషగిరిని పెళ్ళిచేసుకొంటోంది. తనెవరైనా ప్రేమించితే తన యిష్టానికి వ్యతిరేకంగా ఇంకెవరికో ఇచ్చి చెయ్యకపోవచ్చు. కానీ తన యవ్వనం...తన సుదీర్ఘమైన జీవితమంతా ఏమైయ్యేట్లు? శేషగిరిని తను ఏ దృష్టితో చూడాలి? తన కోరికలన్నీ కరడుగట్టి బండబారిపోవలసిందేనా?

"నీ ఋణం జన్మజన్మాలెత్తినా తీర్చుకోలేను. ఈ నిర్భాగ్యుడిమీద మాత్రం ఆగ్రహం వహించకు తల్లీ. ఓ కంటితో కనిపెడుతూవుండమ్మా!" అన్నాడు రామనాథం!

"నేనెందు కొప్పుకుంటున్నా నాన్నా? నువ్వుమాత్రం ఏం చేస్తావు? చిన్నతనంనించీ అంత అల్లారుముద్దుగా, అమ్మను మరిపించేట్లు పెంచిన నిన్ను ఈ జన్మలో మర్చిపోగలనా?" అనేంతలో ఆమె కళ్ళు అశ్రుపూర్ణాలయాయి. ఒత్తుగా వస్తున్న దుఃఖాన్ని ఎలాగో నిగ్రహించుకొని "ఇంత చేసింది నీకోసం కాదు నాన్నా?" అంది.

రామనాథం బయటికి వెళ్లి ఉత్తరీయంతో కళ్లొత్తుకున్నాడు.

జానకికి శేషగిరిల్లు క్రొత్తేమీ గాదు. అంతా కొట్టినపిండే! అన్ని పనులూ తనకు తానై కల్పించుకొని నిర్వహించసాగింది. ఇనప్పెట్టె తాళాలు సహితం తన చేతులోనే వుంటున్నాయి. శేషగిరి ఒకవిధంగా అన్ని బాధ్యతలూ ఆమెకు అప్పజెప్పాడనే చెప్పాలి!

అనుకున్న ప్రకారం శేషగిరి రామనాథానికి రెండువేల రూపాయలు తెచ్చి ఇచ్చేశాడు. నారాయణని విశాఖపట్నం పంపటంగూడా ఎప్పుడో జరిగిపోయింది. సూర్యకాంతమ్మకు గట్టి వైద్యుణ్ణి పెట్టించి, చికిత్స బాగానే చేయిస్తున్నాడు రామనాథం! జబ్బు కొంత తిరుగుముఖం పట్టింది.

జానకి రెండో అంతస్థుపైన కూర్చుని కిటికీలోంచి ఎదురుగా కన్పిస్తున్న గోదావరి వంకే చూస్తోంది. గోదావరికి నీళ్లొచ్చాయి. నిండుచూలాలిలా ప్రవహిస్తోంది గోదావరీతరంగిణి! "ఎందుకో

 

# నదులూ - నరులూ



ఆ నది కెంత పొంగు!" అనుకుంది జానకి. ఇంత ఉల్లాసంగానే వెళ్ళి వెళ్ళి ముసలి సముద్రుణ్ణి చూడగానే గర్వం అణిగిపోతుంది. గోదావరి తండ్రి ఏమాశించి అలాటి అందాలరాశి తన కూతుర్ని ముసలి మొగుడి కిచ్చి చేస్తున్నాడో?

"జానకీ" అన్నాడు తండ్రి ఇంట్లోకి వచ్చి.

"ఏం నాన్నా! అమ్మ కెలావుంది?" అంది కూతురు.

"ఫరవాలేదమ్మా. బాగానే వుంది. నారాయణఅన్నయ్య ఉత్తరం రాశాడు. హోటల్లో డబ్బు కట్టాలిట" అన్నాడు.

జానకి మాట్లాడకుండా వెళ్ళి పెట్టెతీసి వంద రూపాయలు పట్టుకొచ్చిచ్చింది. తండ్రికి కూతురిని చూచిన ప్రతిక్షణం, ఆమె ముఖంలో నైరాశ్యం చూచిన ప్రతిక్షణం తాను పాతాళలోకానికి దిగిపోతున్నట్లుగా వుంటుంది. తను పాపి! తన స్వార్థంకోసం ఆమెను అన్యాయంగా హత్య చేశాడు. జానకితో ఎక్కువగా మాట్లాడలేదు "వస్తానమ్మా" అంటూ వెళ్ళిపోయాడు. ఆమె దీర్ఘంగా నిట్టూర్చింది.

కాలాలు మారాయి. గోదావరి ఎండి వరుదైపోయింది. నదిలో చాలా చోట్ల ఇసుకతిన్నెలు బయటపడ్డాయి. ఇంత చిక్కిపోయినా నదీజలాల్లోని స్వచ్ఛత, తియ్యదనం మాత్రం ఈషణ్మాత్రమైనా తగ్గలేదు సరికదా మీదుమిక్కిలి పెరుగుతూ వచ్చింది. ఇదివరకు గోదావరి నిండు చూలాలిలా నడిచేది. ఇప్పుడు నిర్లిప్తంగా, ప్రాపంచిక విషయాలకు దూరమైనట్లు నడుస్తోంది. నదిలోవున్న నైరాశ్యమంతా ఇసుకతిన్నెలరూపాన బయటపడింది. మోడువారిన కోరికలు ఆ రూపాన బయటపడ్డాయి గాబోలు. సముద్రుడిపైన నదికి ఇష్టంలేకపోయినా సాంగత్యప్రభావం తప్పలేదు మరి. తనలోవున్న నైరాశ్యమంతా తనకు పుట్టబోయే చిట్టిపాప ముఖాన బయటపడుతుంది గాబోలు - అనుకుంది జానకి. ఆమె రోజురోజుకూ నదిలో కలిగే మార్పుల్ని పరీక్షిస్తూనే వుంది.

ఓరోజు శేషగిరి "తాళాలు ఒక్కసారిలా ఇవ్వు" అన్నాడు. జానకి తాళాలిచ్చింది. తనక్కావలసిన డబ్బు తీసుకొని మళ్ళా తాళాలు తనచేతి కివ్వకుండానే వెళ్ళిపోయాడు. జానకి ఆశ్చర్యపడింది. తాళాలు ముందుగా తనకు తానై ఇచ్చి మళ్ళా తీసుకోవడంలో ఉద్దేశ్యమేమిటో తన కర్థంకాలేదు. తను తండ్రికి చేసిన సహాయం అయిదువందలూ లెక్కచూచుకొంటే తక్కువయ్యాయనేమో? తన్నడగవచ్చుగా! నాన్నకిచ్చానని తెలిస్తే ముందు తనే ఒప్పుకున్నాడాయెను. "జానకిని తన కిచ్చి చేస్తే వేన్నీళ్ళకి - చన్నీళ్ళలా సహాయపడుతూ - చేదోడు వాదోడుగా వుంటానని" మరి తను అనుకున్నట్లే చేసినందు కిప్పుడెందుకు కోపం రావాలి? జానకి మనసులో ఏదో అవ్యక్తమయిన భయాందోళన బయలుదేరింది. రెండోరోజు

"తాళాలిస్తారా?" అని అడిగింది.

"నేనిక నీ కివ్వదల్చుకోలేదు." అన్నాడు శేషగిరి కుర్చీలో కూర్చుని ఏదో పుస్తకం చదువుకొంటూ.

"ఏం?" అంది జానకి.

"ఆ విషయం నీకే తెలుసు"

"ఎలా తెలుస్తుంది?"

"తెలియకపోతే తెలిసేంతవరకూ నాదగ్గరే వుండనివ్వు"

"మీరనేది నాకేమీ అర్థంకావడం లేదు" అంది జానకి.

"ఎలా అర్థమవుతుంది? బహుశా నేను పుట్టింది నీకోసమూ, మీ కుటుంబంకోసమే అనుకుంటున్నావు గాబోలు"

"ఒకరికోసం ఇంకొకరు పుడతారా ఏం?" అంది జానకి.

"మరి నా సొమ్మంతా నీ తండ్రికి దానధర్మం చెయ్యడంలో వుద్దేశ్య మేమిటి?" అన్నాడు చదువుతూవున్న పుస్తకాన్ని మూసేసి.

"అది ముందనుకున్న మాటేగా?"

"ఏమని?"

"మనిద్దరికీ వివాహం జరిగితే మానాన్నకి మీరు సహాయం చేస్తారని"

"అలా అన్నట్టు అసలు మానాన్న ఒప్పుకోనేలేదు."

"అప్పు డొప్పుకున్నా ఒప్పుకోకపోయినా మీ రనుకున్నట్లుగానే జరిగిందిగా?"

శేషగిరిముఖంలో కోపం హఠాత్తుగా ప్రవేశించింది "అంటే నువ్వు నా యింటి కొచ్చింది నన్ను నాశనంచెయ్యడానికే నన్నమాట"

"దీంట్లో నాశన మేముంది? వాళ్ళు కష్టాల్లో వున్నారు. మీరు చేసిన వాగ్దానం ప్రకారం సహాయంచేశాను. అంతేనా?" అంది జానకి. శేషగిరికోపం ఆమె నేమీ కదలించలేకపోయింది.

"పెళ్ళయి సంవత్సరమయినా కాలేదు. అప్పుడే అయిదు వందలు ఇచ్చావు. ఈ లెక్కన నేనెంతో కాలం వుండనవసరం లేదు. ఈవిధంగానే నువ్వు దోచేస్తూవుంటే ఆ పుట్టబోయే పిల్లాడిమాట ఏమిటి? మీ నాన్న నాకిచ్చి నిన్నెందుకు చేశాడో నాకు తెలుసు. దానికి ఎలా నడవాలో కూడా నాకు తెలుసు. ఈ ఇంట్లోనించి ఒక్క కానీ అయినా ఇక మీనాన్నగ్గానీ, ఎవరికీ ఇవ్వడానికి వీల్లేదు" అంటూ శేషగిరి మెట్లు దిగి క్రిందికి వెళ్ళిపోయాడు.

జానకికి తాను సర్వనాశనమైపోయినట్లనిపించింది. తాను నిర్మించిన ఆశాసౌధమంతా టప్పున కూలిపోయింది. తానెందుకు తన జీవితసర్వస్వాన్నీ త్యాగంచేసిందో దాని ప్రయోజనం ఆకాశకుసుమంగా మారిపోయింది. ఇటు తన జీవితం అడవికాచిన వెన్నెలయింది. అటు తనఆశయం ఎందుకూ గాకుండా వృధాఅయింది. పైగా తన కడుపున పసిబిడ్డ. తన జీవితం రెంటికీచెడ్డ రేవడి చందమైంది. శేషగిరిలో ఎంతటి విషముంది? నరనరాలకూపచ్చిస్వార్థం గాఢంగా పరివ్యాప్తమైపోయింది. తన యవ్వనపు తియ్యని కోర్కెల్ని చంపుకొని తీరని కోర్కెలుగాజేసి ఎవరిని తను తండ్రిగా చూచేదో ఆ శేషగిరిని భర్తగా స్వీకరించింది ఎందుకు? హాయిగా ఆనందడోలికల్లో ఊగవలసిన తను కృంగి కృశించిపోతోంది ఎందుకు? అంతా కన్నతండ్రి చుట్టూ ఆవరించిన చీకటిని తరిమేయాలనేగా? తన త్యాగమంతా నిష్ఫలమైపోయింది. తనూ ఆ చీకట్లో దిగబడింది. భగవంతుడంటూ ఒకడుంటే ఈ చేష్టలకు అర్థం ఏమని నిర్వచిస్తాడో? తనింకా ఎందుకు బ్రతకాలి? తనకోసం కాకపోయినా, తండ్రికోసం అన్నిటినీ సహిస్తూ ఇంతకాలంవరకూ జీవించింది. ఇప్పుడా ఆశలన్నీ అంతరించిపోయాయి. ఇంకా తన జీవితానికి సార్థక్యం ఏముంది?

జానకికి గోదావరి కంటికక్కనిపిస్తోంది. కాంతి తప్పిన ఆమె ముఖం లోతుకు తోసుకుపోయి బొమికలు బయటికి పొడుచుకొచ్చాయి. "ఏముంది చెల్లీ! జీవితాలు నిస్సారమైపోయాయి. మనిద్దరి జీవితాలు ఒకటేగా?" అంది. "ఇవాళ నా విషయమేమిటో తేల్చుకుంటాను?" అంది జానకి. "ప్రయత్నించి చూడు - నిన్ను చూసేవాలోనైనా ధైర్యం కలిగి నేనూ నీకుమల్లే విషయాన్ని అటో ఇటో తేల్చుకోగలనేమో" అంది గోదావరి.

జానకి మెట్లదిగి గబగబా క్రిందికి వెళ్ళింది. శేషగిరి ఏవో డబ్బు లెక్కలు రాసుకొంటున్నాడు జానకి ముఖం చూచి శేషగిరి ఆమె అనుకున్నంత ఆశ్చర్యపడలేదు

"ఓ వందరూపాయలు కావాలి" అంది జానకి. మాట్లాడేప్పు డామె కువ్క్ర వదనం ప్రజ్వలితమైంది అధరాలు విచిత్రంగా వణుకుతున్నాయి.

పుస్తకంమీదనించి తలెత్తకుండానే "ఎందుకు?" అన్నాడు శేషగిరి.

"అవసరం."

"మీనాన్న కివ్వడానికేనా?"

"ఊఁ"

"ఇవ్వడానికి వీల్లేదని చెప్పాను" మాటలో గాంభీర్యాన్ని తెచ్చుకున్నాడతను.

"మరి ఆయన నన్ను మీ కెందుకిచ్చినట్లు?"

"అది ఆయన్నడుగు."

"నేనే చెపుతున్నాను. నిన్ను చూచి గాదు. నువ్వూ, నీ మొదటిభార్యా సుఖంగా వుండే రోజుల్లో నేనెంత చిన్నపిల్లనో గుర్తుందా? నిన్నేమని సంబోధించేదాన్నో గుర్తుందా? నిన్ను చేసుకుంది వలచి కాదనే విషయం నీకూ తెలుసు. ఆయన ఆర్థిక దుస్థితి భరించలేక నన్ను నీ కిచ్చాడు. కానీ నువ్వేం చేశావు ఆయన ఆశాకిరణాన్ని మిథ్యచేశావు. నేను నా జీవితం నాశనమైపోయినా, యావ్వనపు వాంఛలన్నీ అడుగంటిపోయినా నాన్నకు సహాయం చేయగలుగుతున్నాననే ఆత్మసంతృప్తితో జీవిస్తున్నాను. కానీ వాటి నన్నిటినీ కూకటివ్రేళ్లతో పెల్లగించివేశావు నువ్వు! నీలో ఇంత స్వార్థముందని తెలీలేదు" జానకి మంచంమీదపడి వెక్కి వెక్కి ఏడ్వసాగింది. శేషగిరి జానకి ఉద్వేగంతో చెప్పిందంతా సావధానంగా విన్నాడు. "ఇదుగో జానకీ! నేను స్వార్థం కోసం చేశానన్నావు గాని మీ నాన్న చేసిందేమిటో కాస్త చెప్పు" అన్నాడు.

"ఆయన అంతకంటె ఏమి చెయ్యగలడు?" అంది ఆమె.

"నేనూ అంతకంటె ఏమీ చేయలేను"

"అంతేనా ?" కొంచెం తీక్షణత ముఖంలో వ్యక్తంచేస్తూ అడిగింది జానకి.

"స్వార్థమనేది బుర్రలో ప్రవేశించిన తరువాత ఇక అంతే! తను తప్ప తక్కినవన్నీ ఘృణితంగానే కన్పిస్తాయి. "నువ్వ"





## నదులూ - నరులూ



...ంత ప్రశక్తి వుండదు. అంతా నేనే! నేనే సర్వప్రపంచమూను. మీ నాన్న స్వార్థంకోసం నిన్ను నాకు చేశాడు. నిన్ను అడ్డుపెట్టుకొని నా సొమ్మంతా కాజెయ్యాలనుకున్నాడు. ఈ విషయం మీ నాన్న నాదగ్గరకొచ్చి "మా అమ్మాయిని పోషిస్తా" నన్నప్పుడే తెలుసుకున్నాను. ఒకనాడు "ఇంకోసారి ఆ మాట ఎత్తకంటే మర్యాదగా వుండదని" మందలిస్తే తను ఆనాడు పూరికే నవ్వుకుంటాడని ఎలా అనుకుంటాను! ఇదివరకు అతనిమీద వున్న అభిమానంగూడా నాలో లేదిప్పుడు. దానికి కారణం నన్ను ద్రోహం చెయ్యదలిచాడనే విషయం తెలుసుకోవడంవల్ల నేమో! ఆనాడు సొమ్మంతా ఇలా ఇతరులకి పంచిపెట్టి రేపు నా పుట్టబోయే పసికందుకు ఏమియ్యను. నేనూ మానవుణ్ణనే విషయం నీకూ తెలుసు. నాలో స్వార్థం లేదన్నా నువ్వు ఒప్పుకోవు. మీ నాన్న చేసినపని ఎంతవరకు సఫలమైందో తెలుసుకుందామనే తాళాలు నీచేతి కిచ్చాను. అనుకొన్నట్లా నిజమైంది. ఇక మీ నాన్నగానీ, మీవాళ్లకిగానీ ఒక్క కానీ అయినా ఇవ్వదలుచుకోలేదు" శేషగిరి లేచి బయటికి వెళ్లిపోయాడు.

జానకికి నవ్వు తెలియలేదు. ఏడ్పూ తప్పినంత పనయింది. మానవుల్లో ఇంతటి విషపూరిత హృదయాలుంటాయని తన కిప్పటికి తెలిసింది. తన జీవితాన్ని ఏ కోణంనుంచి చూచినా అంధకార బంధురంగానే వుంది. విషపూరిత జీవితాలు భయంకరంగా గర్జిస్తున్నాయి.

తనకి బ్రతుకు మహా భారంగా వుంది. తను చచ్చిపోవడంవల్ల ఇప్పుడెవ్వరికీ నష్టం లేదు. అటు తండ్రికీ సహాయపడలేదు. ఇటు తనూ సుఖపడలేదు. కానీ ఒక్కటే అడ్డంకి. తనే విధంగా చద్దామన్నా చావటానికి వీల్లేదు. ముందుగానే అనుమానించి శేషగిరి తగిన జాగ్రత్త తీసుకున్నాడు. పనిమనిషి ఎల్లప్పుడూ తన వెంటుకొనే తిరుగుతూ అనుక్షణం తనని గమనిస్తూనేవుంది. ఈవిషయం తండ్రికి తెలిస్తే ఆయన బ్రతుకుతాడా? అన్నదిగూడా ఒక సమస్యే!

నారాయణ సెలవు లయిపోవచ్చాయి. ఇప్పుడే బయలుదేరివెళితేనే గాని అక్కడ తనకు కావలసిన గది వగైరా వ్యవహారాలు చూచుకోడానికి వీలుండదు. రామనాథం మామూలుగానే కూతుర్ని సమీపించాడు. తండ్రి తన యింటి కెందుకు వచ్చాడో తనకు తెలుసు. డబ్బవసరం లేకపోతే అసలతను తన ముఖం చూపించడు.

"ఎలాగో రెండో సంవత్సరం గూడా గడిచిపోయిందమ్మా! ఇంకొక్క సంవత్సరం! అదిగూడా గడిచిపోతే ఇక నాకేమీ బాధలుండవు. అన్నయ్య విశాఖపట్నం వెళతానంటున్నాడు. ఇప్పుడెళితేగాని వ్యవహారాలన్నీ చూచుకోడానికి వీల్లేదట." అన్నాడు రామనాథం. రామనాథానికి "డబ్బు కావాలి" అని సూటిగా అడగడం అలవాటులేదు.

జానకి హృదయంలోనించి వెయ్యి గొంతుల ఏడుపు వినిపిస్తోంది. "డబ్బుయిపోయిందా నాన్నా?" అంది. ఆమె అలా అడగటం ఇదే మొదటిసారి.

"అప్పు మందుల కివ్వగా మిగిలిన యాభై రూపాయలూ నా ఖర్చుకిచ్చానమ్మా" అన్నాడు తండ్రి!

జానకి అటువేపు తిరిగి కుంచెలోని గోదావరివైపే చూస్తోంది. కొన్ని క్షణాలక్రితం నిర్మలంగావున్న ఆకాశంలో ఇప్పుడు మబ్బులుకూడి వర్షించ నారంభించాయి. వర్షించిన ప్రతి చినుకూ నదిలోపడి పైకెగురుతోంది. తన తండ్రి దేన్నైతే ఆశించి తన గారాబుకూతుర్ని సముద్రుడిదగ్గరకు పంపాడో అది నష్టమైపోయిందన్న దిగులుతో గోదావరి ఏడుస్తున్నట్లుగావుంది. నది కళ్లవెంట నీళ్లు చిందుతున్నాయి. అప్రయత్నంగా జానకి కళ్లవెంట గూడా నీళ్ళు కారసాగాయి.

"ఇకనించి నే నీకేమీ సహాయం చెయ్యలేన్నాన్నా" అంది.

రామనాథం పిడుగు పడిన తరువులా కూలిపోయాడు. ఈ మార్పు సహజంగా తన కూతురిలో వచ్చింది కాదని ఆమె కంఠాన్ని బట్టి తెలుస్తూనే వుంది. శేషగిరికి తెలిసి అంతా చెప్పివుంటాడనే విషయం గ్రహించలేనంత కష్టమైందికాదు.

"ఇవ్వద్దన్నాడా తల్లీ?" అన్నాడు.

"అవున్నాన్నా! తాళాలు గూడా తీసుకున్నారు. నువ్వు తలిచింది వేరు. దానికి కేవలం వ్యతిరేకంగా జరిగింది. నువ్విదంతా స్వార్థంకోసం చేశావని ఆయన అపోహపడ్డారు. ఇక నీకొక్క కానీ వచ్చే దారేమీ లేదు" అంది అటు తిరిగి నిలబడే!

రామనాథం కూలబడి దీర్ఘనిశ్వాసం విడిచి "ఎంతపని చేశావు శేషగిరీ" అన్నాడు.

"ఏమిటది?" అంటున్నాడు శేషగిరి పైకొస్తూ!

రామనాథంహృదయంలో ధగధగా మంటలు మండుతోంది. శేషగిరి చెప్పిన మాట లేవిటి? ఆనాడు చేస్తున్న దేమిటి? అతని కళ్లు ఎఱ్ఱబడి చింతనిప్పులయ్యాయి. ఉద్రేకంలో నరాలు వుబ్బాయి "ఏమిటా, నువ్వింత వచ్చికసాయివాడి వనుకోలేదు" అన్నాడు.

"అవును మరి. నేనూ, నా పుట్టబోయే కొడుకూ మీచేత చిప్ప చేతి కిప్పించుకొంటే సాదువయ్యేవాణ్ణి!" అన్నాడు వ్యంగ్యంగా.

"నీక్కావలసిన సహాయం చేసే బాధ్యత నాదని వాగ్దానం చేశావే? నీ తియ్యటి మాటలు నమ్మి పండంటి కన్న కూతురి గొంతు కోశాను. ఆమె పచ్చటిజీవితం ముళ్లకంచెలో వేశాను. కోమలహృదయాన్ని

అగ్నిగుండంలో పడేశాను..." ఆవేశంలో ఇంకా ఏమేమో అనేస్తున్నాడు. శేషగిరి అందుకొని "అవన్నీ ఇప్పుడనుకున్నా లాభంలేదు. మర్యాదగా వెళ్ళిపో" అన్నాడు.

"నువ్వింత ద్రోహం తలపెడతావనుకుంటే ఇలా జరిగివుండేది కాదు. మా వుసురు, జానకివుసురు తప్పకుండా తగులుతుంది" అన్నాడు ఉద్రేకం ఆగక రామనాథం!

"తగిలితే అనుభవిస్తాలే! ముందు నువ్వెళ్ళు. ఇంకెప్పుడూ రాకు" అన్నాడు శేషగిరి. రామనాథం చేసేదేమీలేక క్రిందికి దిగిపోయాడు.

తండ్రి ప్రస్తుత పరిస్థితుల్ని బయటపెట్టినప్పుడు నారాయణ నవనాడులూ తెగినట్లయింది. చీకట్లో వెలుగునుచూసి ఆశపడ్డాడు. అంతలో అది మిథ్యయింది. అసలు కనపడనప్పటికంటె ఇప్పటి బాధ ఎక్కువ. ఇంతకాలం పట్టుకున్న పట్టుకొమ్మ విరిగిపోయింది. ఆశ అంతరించిపోయింది. తనిలా చదువాపేస్తే తన జీవితం ఏంకాను. రెండేళ్లు చదివినందుకు కనీసం బి. ఏ., డిగ్రీ అన్నా ఇవ్వరు.

ప్రతివారి హృదయంలోనూ చెప్పలేనన్ని బాధలు పెరిగిపోయి మహోత్పాతాలయాయి. అవి మనస్సులో స్థిరంగా పీఠం వేసుక్కూర్చున్నాయి. అందరికీ ఎటు చూసినా ఘోర భయంకర తిమిరం తప్ప దారీ తెన్నూ కనిపించడంలేదు. ఎనలేని సమస్యల పరిష్కార మార్గాలకోసం ఎవరికి వారు తన్నుకు చస్తున్నారు. ప్రతివారికీ జీవితం భరించలేనంత దుర్భరంగా, యాతనావహంగా తయారయింది. ఎవరిమీద వారికి ఎనలేని ద్వేషం పుట్టుకొస్తోంది. ప్రపంచమంటే ఎనలేని రోత పుడుతోంది.

ఎవరికివారు కర్తవ్యాన్ని గురించి యోచించనారంభించారు. పైకి అందరూ ఘోర గంభీరముద్ర వహించారు. జానకి కిటికీదగ్గర నిలబడి మరొకసారి నదివంకదృష్టి ప్రసరింపచేసింది. గోదావరి నిండుగా వస్తోంది. ఎప్పుడూ లేని ఉరవడితో వస్తోంది. క్షణంక్షణం ఆమెలో ఆగ్రహచిహ్నాలెక్కువవుతున్నాయి. ఆగ్రహంలోకూడా అనుగ్రహం చూపించే బాంధవ్యం ఆమెకూ



# నదులూ - నరులూ



జానకికి మెళ్కువ వుంది. జానకి ఆమెనించి ఏ దివ్యసందేశాన్నో అందుకొని నిశ్చింతగా వచ్చి పండుకుంది. నారాయణ ఆరోజల్లా వూరంతా తిరిగి ఇంటికి చేరాడు. నిండు గోదావరిపై ఆశపెట్టుకొని ఇంటిల్లిపాదీ నిద్రపోయేవరకూ మేలుకొనే వున్నాడు. జీవితాన్ని కాచివడపోసినవాడుగనక రామనాథం అంతకంటె తేలికమార్గా న్నాలోచిస్తున్నాడు.

జానకి పండుకున్నా నిద్ర పట్టలేదు. ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్లుగా పండుకుంది. కొంచెంసేపటికి కిటికీతలుపులు తెరిచింది. ఆ నిశ్శబ్ద నిస్తబ్ధవాతావరణంలో గోదావరిప్రళయగర్జన వినిపిస్తోంది. "ఇదుగో వస్తున్నా చెల్లీ! నిన్ను చూచాక నాకూ ధైర్యమొచ్చింది. నేనూ విషయం అటో ఇటో తేల్చుకోవాలనే బయలుదేరాను" అంటోంది గోదావరి తనకు దగ్గరదగ్గరగా వస్తూ!! ఆమెకు భయంవేసింది. కిటికీ తలుపులు గట్టిగా మూసింది. మరుక్షణంలో హాహాకారాలు వినిపిస్తున్నాయి. ఎవరో క్రిందిభాగంలోకి బయటనించి తలుపు కొడుతున్నారు.

"ఇంట్లోకి రావడానికి వీల్లేదు" కఠినంగా సమాధానం చెపుతున్నాడు శేషగిరి.

"శేషగిరీ ఈ ఒక్కక్షణం రక్షించు. నీ మేలు మరిచిపోలేను" తండ్రి రామనాథం కంఠం!!

"వీల్లేదు. చావండి ఆ నీళ్లల్లో పడి" అంటున్నాడు శేషగిరి!

జానకి గబగబా వెళ్ళి తలుపులు తీసి క్రిందికి చూచింది. క్రింద శేషగిరి తలుపు దగ్గర నిలబడి బయటవున్న తన తండ్రికి కఠినంగా సమాధానం చెపుతున్నాడు. పిల్లలంతా ఏడుస్తున్నారు బయట. గోదావరికి కోపమొచ్చి ఒక్కసారి విజృంభించింది. ఇళ్ళన్నీ మునిగిపోతున్నాయి.

"వాళ్లని లోనికి రానియ్యండి" జాలిగా అంది జానకి.

"వీల్లేదు. నువ్వు పైకెళ్ళు" గ్రుచ్చరించాడు శేషగిరి.

జానకిలో సహనం నశించిపోయింది. "నువ్వు మనిషివా—పశువ్వా" అంటూ క్రిందికి దిగనారంభించింది. ఆమె క్రిందికి దిగేసరికే అప్పటివరకూ బయట కేకలు పెడుతున్న పిల్లల ఆర్తనాదాలు వినిపించి అంతరించిపోయాయి ఇంట్లోకి గూడా నీళ్లు వచ్చాయి జానకి గబగబా పైకి నడిచింది ఆమెతోపాటు శేషగిరీ పైకి నడిచాడు. అతను పైకి చేరేసరికే జానకి రెండో అంతస్థులో కెళ్లి తలుపు గడియ వేసుకుంది.

"జానకీ తలుపు తియ్యి" తలుపుకొడుతూ శేషగిరి కేక వేస్తున్నాడు.

"ఈ ఇంట్లోకి రావడానికి వీల్లేదు" నిబ్బరంగానూ, కాఠిన్యంగానూ సమాధానం చెప్పింది.

"ఇది వేళాకోళంకాదు జానకీ"

"అదే నేనూ అంటున్నాను. కుటుంబమంతా నీళ్లల్లో కొట్టుకుపోతూ తలుపు తియ్యమంటే వేళాకోళమనేనా తలుపు తియ్యనన్నావు? నువ్వు మనిషివి కావు. రాక్షసుడివి పో!" అంది. ఉన్నకొద్దీ నీటిమట్టం పెరుగుతోంది. ఇంట్లోకి ఆరడుగుల వరకూ నీళ్లొచ్చేశాయి. తనదగ్గరికి రావడాని కింకా ఎంతోసేపు పట్టదు.

"జానకీ నన్ను క్షమించు. నీళ్లు వచ్చేస్తున్నాయి" అన్నాడు దీనంగా బ్రతిమలాడుతూ శేషగిరి.

"నిన్నా క్షమించేది. నా జీవితాన్ని నాశనంచేశావు. ఎందుకూ కాకుండా పాడుచేశావు. ఆడదంటే ఏమిటో అనుకున్నావు నీ మనస్సుకి. నీ కిష్టంవచ్చినట్లు ఉపయోగించుకొనే కీలుబొమ్మనుకున్నావు. అనుభవించు. ఆ నీళ్లల్లోనే కలిసిపో! మానవు లెప్పటికైనా చచ్చిపోవలసిందే. కాకపోతే కొందరు ముందు కొందరు తరువాత! నీ డబ్బు, నీ హోదా ఇప్పుడేమీ పని చెయ్యవు" అంది.

"అంతేనా" అన్నాడు శేషగిరి. ఆ కంఠాన్నిబట్టె అతడు చిన్న పిల్లాడిలా ఏడుస్తున్నాడని తెలుస్తూనే వుంది. ఆ సమయంలో శేషగిరి తన హోదాను, తన సర్వస్వాన్నీ మర్చిపోయాడు. కేవలం చిన్నపిల్లవాడయాడు. జానకి మాతృహృదయం బయటపడింది. ఆమెకూ భర్త విలువెంతో తెలుసు. భారత స్త్రీకి మాంగల్యం ఎంత ప్రధానమైనదో తెలుసు. ఆమెహృదయం శేషగిరిపట్ల దయతో నిండిపోయింది. "ప్రాణమంటే ఎంత తీపో ఇప్పటికైనా తెలుసుకున్నావా?" అంటూ తలుపు తీసింది. నీళ్లు వెల్లువగా ఒక్కసారి గదిలో కొచ్చిపడ్డాయి. శేషగిరి ఆ వెల్లువకి బొక్కబోర్లగా పడ్డాడు. ఇంచుమించు అతనికి స్పృహలేదు. ఎలాగో తీసికెళ్ళి అతన్ని మంచంమీద కేర్చు గలిగింది జానకి. గదిలో అడుగువరకూ నీళ్లు వచ్చేశాయి

ఈ మేడ ఇప్పటిదిగాదు. తాతలనాడు నిర్మించినది. ఆ ప్రవాహవేగానికి తట్టుకొనే తాహతు దానిలో లేదు. శేషగిరికి స్పృహవచ్చింది "జానకీ ఈ మేడ ఇంకా ఎంతోసేపు నిలవదు - చివరిక్షణంలో నీకొక్కమాట చెప్పనా! మానవులు చేసే తప్పులికి ఏ శిక్ష విధించాలో ప్రకృతికి బాగా తెలుసు" అన్నాడు.

నీటిమట్టం ఇంకా పెరుగుతూ మంచంపైనున్న తన ముద్దు పెట్టుకుంటానికి గోదావరి వస్తున్నట్లుగా వుంది "ఇంకా చూస్తావేం చెల్లీ! చూచావా! నేనెంతగా విజృంభించానో! ఇది నా ఆఖరి పిలుపు. మోడువారిన జీవితాలు మనవి. పద" అంటోంది గోదావరి.

ఆ క్షణంలో జానకి అనుకుంది "భగవంతుడా! నీ చేష్టలే సరైనవి! ఈ విపత్తిని తాల్చి ఏమార్గంలో కడతేర్చాలో నీకొక్కడికే తెలుసు" అని.

మరుక్షణంలో మేడ దప్పగా కూలిపోయి ఆ ప్రదేశమంతా జలంచేత కప్పబడిపోయి గతక్షణంలో సమస్యలతో సతమతమవుతున్న జీవుల్ని సమస్యారహితుల్ని చేసేసింది గోదావరి!



# కనపడని వ్యక్తితో....!

ఒక స్త్రీ కంఠం: లలితా! ఓ లలితా! (తలుపు కొట్టిన చప్పుడు)

లోపలనుండి: మరో స్త్రీ కంఠం: } ఎవరండీ?

మొ. గొంతు: నేనే సరోజిని!

కమల: రండి! యిలా కూర్చోండి.

సరో: లలిత యింట్లో లేదమ్మాయ్?

క: లేదండీ! యిప్పుడే బయటికి పోయింది. ఎవరన్నా వస్తే వుండమని చెప్పి వెళ్ళింది.

స: చూడమ్మా! నిన్నెక్కడో చూసినట్లుగా వుంది.

క: దానికేం లెండి! మనిషిని పోలిన మనుషులుంటారుగా?

స: అదీ నిజమేలే! లలిత నీకేమవుతుంది?

క: ఏమీ కాదు.

స: అదేమిటమ్మాయ్! ఏమీ కాకపోవట మేమిటి? తమాషాగా మాట్లాడుతున్నావే?

క: బంధువులు కాకపోయినంత మాత్రాన కలిసుండకూడదా? లలిత నా బాల్య స్నేహితురాలు.

సరో: ఓ! అలా చెప్పు. నీ పేరేమిటమ్మాయ్!

క: కమల!

స: (ఏదో గుర్తుకొచ్చి, ఆశ్చర్యంగా).. చిన్నగా) కమలా? కమల! అవును కమలే? (బిగ్గరగా) నీపేరెక్కడో విన్నట్లుగా వుందమ్మా!

క: మీరు భలేవారండీ? అంతా విచిత్రంగా మాట్లాడుతున్నారు. చూడగానే ఎక్కడో చూసినట్లుందన్నారు, పేరు వినగానే ఎక్కడో విన్నట్లుందన్నారు. ఆంధ్రదేశంలో మీ పేరూ నా పేరూ గలవాళ్ళు ఎంతమంది లేరుగనక?

స: అంతేలే! పేర్లకేంగాని! మీ దేవూరమ్మాయ్.

క: (కోపంగా) ఏదో వోవూరు! ఏటవతల తాటాకుల పాలెం!

స: ఎందుకమ్మాయ్! అంత కోపం? మీది పూటుకూరుగదూ?

క: పూటుకూరో - ఏట్లో పూరో? తెలిసే ఎందుకడుగుతారు?

సరో: అదేమిటి కమలా? ఆ పత్రిక ఎందుకలా నలిపేస్తావ్? ఏదీ? ఇలా తే?

క: (గాబరాగా) ఏమిటీ? యిదా? ఈ పత్రికా?

స: ఆఁ ఆ పత్రికే!

క: ఎందుకూ? యిది నిన్నటిదండీ!

స: ఆఁఆఁ అలా విసిరేయకు! యిలా యివ్వు! మీ వూరు ఏటవతల తాటాకుల పాలెమో, ఏట్లో వూరో చెబుతాను.

క: ఇదిగో తీసుకోండి. నా సంగతి మీ కెందుకూ, మీ పనేదో మీరు చూసుకోక?

స: మీ నాన్నగారి పేరేమిటమ్మా?

క: మీకనవసరం!

స: ఆఁఆఁ కమలా? పోతావేం? కూర్చో! వొక మాట!

క: (పెనుగులాడుతూ) ఊఁ నా చెయ్యి వదులు! మీకేం పిచ్చా! ఎక్కడో ఏదో పేపర్లో, ఏదో చూసి నన్ను అల్లరిపెట్టావేం? లలిత వచ్చింతర్వాత రా! అసలు నువ్వెవ్వరో నాకు తెలియదు! వెళ్ళండి!

స: (గట్టిగా) నేనెవ్వరో నీకు తెలియకపోయినా నువ్వెవ్వరివో నాకు కన్పడుతూనే వుందిలే?

క: నువ్వెవ్వరో నాకూ కన్పడుతూనే వుంది!

## వాసిరెడ్డి సీతాదేవి

స: ఏయ్! కమలా! ఏమిటా దబాయింపు? ఊఁ ముందు కూర్చో! యింత గట్టిదానివి యింటిదగ్గరనుంచి ఎందుకు చెప్పకుండా వచ్చావు? కూర్చో!

క: అబ్బ! నువ్వెక్కడదాపురించావమ్మా తల్లీ, నా పాలిట! నేనేం పారిపోయి రాలేదు.

స: (నవ్వుతో) నువ్వు పారిపోయి రాలేదులే! కాని 'కనపడటంలేదు.' కమలా యిదిగో విను. (పేపరు మడతలు విప్పిన శబ్దం) 'కనపడటంలేదు' నాకూతురు చిరంజీవి కమల మూడువారాల్నుండి కనపడటంలేదు. వయస్సు 16 సంవత్సరాలు చామనచాయ. పెద్దకళ్ళు. కోలముఖం. నొసటిమీద పెద్ద పుట్టుమచ్చ. అదేమి కమలా? ముఖం దాచుకుంటావే?

క: చాల్లే తల్లీ! యిక ఆపు! నీక్కావల్సింది మానాన్న యిస్తానన్న ఐదువందల రూపాయలేగా?

స: పొరపడుతున్నావు కమలా?

క: (ఏడుపు గొంతుతో) ఆఁ నీక్కావల్సింది ఆ డబ్బేగా? యిట్లా ఆడపిల్లల ఆచూకీ తెలిపి సంపాదిస్తున్నావా? కావాలంటే ఆ డబ్బు నేనే యిస్తాను.

స: ఎంత పిచ్చిదానివమ్మా! కమలా! ఐదువందల రూపాయల కాసపడి యీపని చేస్తున్నానంటావా? మీ నాన్నతో చెప్పుతారే, ఆ డబ్బుతో నీకు వో మంచి నగ చేయించమని. అది సరేగాని ఎందుకమ్మా నువ్వు యింటిదగ్గర చెప్పకుండా వచ్చేసింది? నాన్నా అమ్మ ఎంత బెంగపెట్టుకున్నారో చూడమ్మా! మీ నాన్న ఎంత మంచివాడు?

క: ఆఁ, మంచివారే! మీ కట్లాగే వుంటుంది! అసలు నాన్నేగా యింత చేసింది?

స: ఏం చేశారమ్మా! ఏం జరిగింది? చెప్పు?

క: మానాన్న నన్ను తన చెల్లెలి కొడుక్కిచ్చి పెండ్లిచేయాలని పట్టుపట్టాడండీ. నాకేమో అది యిష్టంలేదు.

స: అంటే మీ అత్తయ్యకొడుక్కిచ్చేగా?

క: ఆఁ మా బావకే!



## కనిపడని వ్యక్తితో...



స: ఏం? మీబావ మంచివాడు కాడా?

క: ఏదో వుంటాడులెండి. నాకూ మా బావకు మొదట్నించీ పడదు. స్కూలు ఫైనలు రెండుసార్లు తప్పి చదువు మానేశాడు. పెళ్లయాక నన్నూ చదువు మాన్పిస్తాడట. మహా కోతలు కోస్తాడు.

స: మీ బావ థలేవాడన్నమాట?

క: మెల్లిగా అంటా రేమిటి? ఆయన గారికి బాగా డబ్బుందిలెండి? మా అమ్మా, నాన్నకు, ఆయనంటే వో ఇంద్రుడుగానో, చంద్రుడుగానో వుంటుంది!

స: ఇంతకీ మీ బావ అందగాడేనా?

క: (సిగ్గుతో) ఊఁ అందుకే ఆయనకు మహా గర్వం! తనకు డబ్బూ, అందంవున్నాయట. మా నాన్న అమ్మ తన కాళ్లమీద పడి నన్ను చేసుకోమని ప్రాధేయపడుతున్నారట. అందుకని పెళ్ళిచేసుకొని నన్ను చదువు మాన్పిస్తాడట! అసలు తెనెవరు, నన్ను చదువు మాన్పించటానికి? మీరే చెప్పండి?

స: ఇంతకీ మీబావకు నీ చదువుమీద అంతపంతం దేనికి?

క: ఏమీ లేదండీ! నేను యీ సంవత్సరం స్కూలుఫైనలు పాసయితే కాలేజీకి పోతానని అతని కడుపుమంట. తను రెండు సార్లు తప్పాడు కాబట్టి యింట్లో కూర్చున్నాడు. నేను చదువుకుంటే తప్పేమిటండీ? మీరే చెప్పండి?

స: ఇందులో తప్పు ఏముందిలే కమలా? అవకాశాలుంటే చదువుకోవటం మంచిదేగా?

క: బయటివాళ్లయినా మీరే నయం. ఆ మాత్రం మాటన్నారు. మా నాన్నగానీ, అమ్మగానీ అన్నారా? అంతా మా బావను వెనకేసుకొచ్చేవాళ్ళే!

స: నీ మంచికోరే అలా అనివుంటారు.

క: ఆఁ ఏమిటీ మీరుకూడ వాళ్ళవైపే పలుకుతున్నారే? మా నాన్న నాకు యింకా చదువెందుకంటాడు. మా అమ్మకు నన్ను ఒక యింటిదాన్ని చేసి సంసారము చేస్తుంటే చూడాలని వుందట.

స: మీ అమ్మకు నీవొక్కదానివే నేమిటి సంతానం?

క: అవునండీ! ఒక్కగాను ఒక్క కూతుర్నుగదా యిలాగేనా చూడాల్సింది? మళ్ళీ చూస్తే కట్టుకుపోయేంత ఆస్తివుంది. మీరే చెప్పండి న్యాయం? యిట్లాగేనా వాళ్లు చేయాల్సింది?

స: పాపం! ఒక్కగాను ఒక్క కూతురు, కళ్ళకు కన్పడకుండాపోతే ఎంత బాధపడుతున్నారో మీ అమ్మ నాన్న?

క: పడితే పడనీయండి? నన్ను బాధ పెట్టినప్పుడో?

స: కమలా! యింతకీ యిలా కనబడకుండా వుండి నువ్వు సాధించగలిగిందేమిటి? పెద్దవాళ్ళను బాధపెడితే నీకు వొరిగేదేమిటి?

క: నేను కావాలని వాళ్లనేమీ కష్టపెట్టలేదు. నేను చదువుకుంటానంటే వాళ్లదేం పోయింది నాకిష్టంలేదు పెళ్లివొద్దంటే వినకూడదూ?

స: ఎంతవరకూ చదువుకోవాలనీ?

క: బి. ఏ. వరకూ చదువుకోవాలని వుంది. బి. ఏ. అయినా అనిపించుకోకపోతే ఏం చదువు?

స: అంటే బి. ఏ. వరకూ చదువుకొని ఎమ్. ఏ. చదువుకున్నవాడ్ని చేసుకుంటావన్నమాట?

క: (ఏడుపు గొంతులో) చాల్లెండి నేనంటే అందరికీ ఎగతాళే!

## తాటితోపు

స: పిచ్చమ్మాయ్. నిన్ను చూస్తే జాలేస్తుంది. మరి నీవిట్లా అమ్మ, నాన్నకు కన్పించకుండా ఒక స్నేహితురాలింట్లో కూర్చొని, స్కూలు ఫైనలు ఎలా పాసవుతావు? బి. ఏ. డిగ్రీ ఎలా పొందుతావు? మరి ఎమ్. ఏ. పాసయినవాడ్ని ఎప్పుడు చేసుకుంటావు?

క: (కోపంగా) వూరుకోండి. నాకు బి. ఏ. డిగ్రీ వద్దు. ఎమ్. ఏ. పాసయినవాడూ వద్దు. నా జీవితమంతా నాశనమయిపోవాల్సిందే. నా కెవ్వరితో సంబంధం వద్దు.

స: కమలా! ఏమిటా పిచ్చి మాటలు? ఎంతో వృద్ధిలోకి రావలసిందానివి. ఎందుకింత నిరాశపడతావు? ఇక్కడ కూర్చొని నువ్వు సాధించగల్గిందేమీ లేదు. మీ నాన్న ఎంత బాధపడుతున్నారో? మీ అమ్మ బెంగతో మంచం ఎక్కిందట. వాళ్లేం చేసినా నీ మేలు కోరేగదా చేసేది? పెద్దతరంవాళ్లు. వాళ్ల అభిప్రాయాలూ, భావాలు వేరు. ఏదో అన్నారే అనుకో? అంతమాత్రానికే నీవు ఇల్లు వదిలి రావాలా? మూడువారాలనుంచీ కూతురు కనపడకుండా వుంటే ఆ తల్లికడుపు ఎంత క్షోభిస్తుందో? నువ్వు తిన్నావో తినలేదో, ఏమై పోయావో, ఏమోనని మీ అమ్మ అహర్నిశం ఎంత హడలిపోతూందో? మాతృహృదయం! కడుపుకోత! నీకేం తెలుసు?

క: అవునండీ! మా అమ్మ వట్టి గాబరా మనిషి? వూరికే హడలిపోతుంది. నాకోకసారి టైఫాయిడ్ వస్తే, మా అమ్మ నిద్రాహారాలు మాని నా మంచం పక్కనే కూర్చుంది. ఓసారి మా స్కూల్లో పిల్లల్తో కలిసి పిక్‌నిక్‌కు వెళ్ళి ఆ రాత్రంతా యింటికి రాకపోతే, నాకోసం ఎదురుచూస్తూ ఆ రాత్రంతా జాగారం చేసింది.

స: అట్లాంటిది మీ అమ్మ యింత కాలంగా నువ్వు కనిపించకపోతే ఎంత బాధపడుతుందో నువ్వే ఆలోచించు! మీ నాన్నయితే మాత్రం నీకోసం దిగులుపడి



## కలువ - చెలువ

ఫొటో: కె. గోపాలకృష్ణమూర్తి—బాపట్ల.



# కనపడని వ్యక్తితో ....!

ఎంత మునిగిపోతున్నాడో? నువ్వు గట్టిగా చదువుకుంటానని అడిగితే నాన్న వద్దంటాడా? ఇన్నాళ్లనుంచీ చదువు చెప్పించలా!

క: అసలు మా నాన్న మంచివారే! నే చెప్పితే వింటాడు. కాని బావే యిదంతా చేసింది!

స: ఆఁ. మీ బావయితేమాత్రం కొంటెతనానికి నిన్ను వుడికించటానికి అట్లా అని వుంటాడు కాని, నువ్వు కాలేజీలో చదువుకుంటానంటే వద్దంటాడా? తన పెళ్ళాం బి. ఏ. అంటే తనకుమాత్రం గొప్పకాదూ!

క: ఫోండి! మా బావసంగతి మాత్రం నాదగ్గర చెప్పకండి!

స: చూడు కమలా! నువ్వేది సాధించినా యింటిదగ్గరుండే సాధించాలిగాని యిలా పారిపోయి వచ్చి ఏంచేయగలుగుతావ్? జీవితంలో వచ్చే అవాంతరాల్ని ఎదుర్కోవాలిగాని, జీవితంనుంచి పారిపోయి చేయగలిగిందేమీ లేదు. అమ్మాయ్ చూడు! ఇప్పటికే మూడుసెలలు వృథాగా కాలం గడిచిపోయింది! ఈ మూడు నెలల్నించీ పెద్దతనంలో వున్న తల్లితండ్రుల్ని బాధపెట్టడం తప్ప ఇంకేం చేయగలిగావ్? చెప్పు! ఇట్లా వాకిట్లో, తనవాళ్ళనూ వదలి బయటికొస్తే, జీవితంలో అనుకోని సంఘటన లేవో జరిగి కోరికలు నెరవేరతాయనుకోవడం వట్టి భ్రమ కమలా! అవన్నీ, సినిమాల్లోనూ కథల్లోనూ జరిగేవే కాని వాస్తవంగా జరిగేవి కావు. చూడమ్మాయ్! లలిత నీకంటే రెండేళ్లు పెద్దా!

క: ఆఁ. అంతే రెండేళ్లు పెద్ద!

స: చూడు మరి! లలిత పెళ్లి చేసుకొని హాయిగా వుండటంలేదు. జీవితంలో ఏవేవో చేయాలని కలలు కనడం తప్పుకాదు. ఆ కలలన్నీ నిజాలు కావాలని ప్రయత్నించడమే వెర్రితనం! అందం, చందం, ఆస్తీ, కాస్తో కూస్తో చదువూవున్న మీ బావను తృణీకరించడం ఏంబావుందీ?

క: మా బావ వట్టి పెంకెమనిషి!

స: నువ్వుమాత్రం ఏం తక్కువ గనక!

స: రేపే ప్రయాణంగదూ! పాపం పెద్దవాళ్లు ఎంతగా ఎదురుచూస్తున్నారో?

క: ఊహూఁ. నేనొక్కదాన్నే పోను!

స: (నవ్వుతూ) మరి వచ్చేప్పుడు వంటరిగానే వచ్చావుగా? సరే! లలిత రాగానే చెప్తాను! లలితకూడా వచ్చి నిన్ను మీయింటిదగ్గర దిగపెడుతుందిలే!

క: అదిగో! లలిత వస్తోంది.

స: కమలా! మరి మీ బావనే చేసుకుంటావుగాదూ? పెళ్ళికి శుభలేఖ రాస్తావుగా!

క: తప్పకుండా వస్తారా! చేతిలో చెయ్యివేసి చెప్పండి వస్తానని! (చేతిలో చెయ్యి వేసినధ్వని).

స: ఓ తప్పకుండా వస్తా! మీ నాన్న యిస్తానన్న ఐదువందల రూపాయలతో మీ బావకు ఒక రేడియో సెట్టుకొని ప్రజంట్ చేస్తా!

క: ఊఁ! ఫోండి! మీకూ మా బావంటేనే యిష్టం! నాకు సెక్షన్ పేయించి పెట్టానంటేరిగా?

స: అలాగే కానీ! కొంపతీసి పెండ్లయింతరువాత మళ్ళీ కనబడటం లేదని పేపర్లో వేయించుకోవేం?

క: పూఁ ఫోండి! మీరు మరీను!

(ఆలిండియా రేడియో ప్రసారితం) ★





# అంతచేస్తే ఇంతేనా!

పండా
ఆదినారాయణమూర్తి

సుఖం అంటే ఏమిటో అసలు అర్థం కాక ఆలోచిస్తున్నాడు ఎల్లప్ప. తన యిన్నాళ్ళ జీవితంలో సుఖం అనుభవించింది సున్నా. తనకిప్పుడు తక్కువ వయస్సేమీ కాదు—భవిష్యత్తులో అంటూ కూచోటానికి. కాస్తో కూస్తో తేడాలో అరవయ్యేళ్లు నిండుతాయి తనకి. మంచి సంబంధాలు కాకపోయినా ఎలాగో లాగ యిద్దరు కూతుళ్ళకీ పెళ్ళి చేశాడు. అంతటితో వదిలిపోలేదు బరువు. ఇంకా బండరాయంత—తను మోయలేనంత—బరువుంది. ఆఖరి కూతుర్ని లచ్చికి పెళ్ళి చేయాలి. కానీ డబ్బెక్కడ వుంది? కూలోళ్ళలోకూడా కట్నాలైతే ఎలా చచ్చేది! "ఇరవై ఏళ్ళొచ్చినా పిల్లకి యింకా పెళ్ళి చేయలేదేంట్రా ఎల్లప్పా" అని కుండ పగలేసినట్లు అడగడమే గాని — ఒకడుకూడా తన కొడుక్కి కట్నంలేకుండా కట్టుకోడు...ఛా! ఎదవలోకం—అతనికి ఆవేశంతోపాటు ఆగ్రహంకూడా మితిమీరిపోగా కాలుతూ కాలుతూ వున్న చుట్టపీకని నేలమీద విసిరికొట్టి తుపుక్కున వుమ్మేశాడు.

"దానికేంనోటు. లచ్చి లచ్చనంగా వుంటాది. ఎదవలు! దమ్మిడీ రాబడిలేనోళ్లు కూడా ఏభైలూ, అరవైలూ కట్నాలడగడమే."

అతనికి లోకంమీద అసహ్యం వేసింది. తర్వాత అలివిమాలిన కోపంకూడా వచ్చింది. లోకం తనను చూచి వెగటుగా పకాలున నవ్వినట్లుంది, రెండు పదహార్ల పళ్ళేసుకొని. అతనిఆగ్రహం అంచులు దాటింది. పళ్ళు పటపట కొరికాడు!— అంతకన్న యింకేమీ చేయలేక

ప్రొద్దున్నే లేచి మిల్లుకి వెళ్ళిపోయాడు ఎల్లప్ప. సూర్యోదయంనుండి సూర్యాస్తమయంవరకు రెక్కలు విరుచుకు పని చేసినా ఒక డొక్కయినా నిండదు. అతని మీద జాలి తలచినట్లు...రెండుపదులు పడేస్తాడు నెలకి ఆ మిల్లుప్రొప్రయిటరు. ఆ రెండుకాగితాలతోటే సాగిపోవాలి సంసారం. జీతానికి తగ్గట్టు జనంకూడా చాల తక్కువేవున్నారు యింట్లో!...నలుగురూ - ఎల్లప్ప, భార్యా, కూతురూ, అతని ముసలితల్లీని గంజి తాగి బతుకుతున్నా బెంగన్నది లేకపోతే ఎల్లప్ప అంతగా కుమిలిపోడు. అతనికి కష్టాలు తరగని ఆస్తిలాగా తయారైనై. ఇరవైఏళ్ల లచ్చి మిగిలింది పెళ్ళికి. దానికి త్వరగా పెళ్ళి చేసేయాలి. అన్నం అతనికి కొరతపడినా ఆత్మాభిమానం కొరతపడలేదు.

ఆ సాయంత్రం పనిఅయిపోయినతర్వాత యింటికి పోదామని బయలుదేరాడు ఎల్లప్ప. మేనేజరుతోటి చెప్పిపోవటానికి గదిలోకి వెళ్ళాడు. గదిలో మేనేజరు లేడు. తిరిగి వెళ్ళిపోదామని వెనక్కి తిరగబోయే సరికి అకస్మాత్తుగా ఏదో అగపడి వులిక్కిపడ్డాడు. మేనేజరు డ్రాయరు సొరుగు తీసివుంది. నిమిషంసేపు అతను తటపటాయించాడు. క్షణంసేపు అతనికళ్ళు మెరిసినై...అతనికి తెలియనిశక్తి ఏదో అతనిలో ప్రవేశించింది. వణుకుతున్న చేతులికి, తడబడుతున్న కాళ్ళకి బలాన్నిచ్చింది ఆశక్తి. మెల్లిగా అంగలు వేసుకొంటూ డ్రాయరు దగ్గరకి వెళ్ళాడు. ఛా! మళ్ళీ చేతులు వణుకుతున్నాయి. ఇంతవరకూ తను దొంగతనం అంటే ఎరగడు. దొంగలని చీదరించుకొనేవాడు తను "ఛీ" అన్న పనికే యిప్పుడు వుపక్రమించబోతున్నాడు. పరిస్థితులు తనని బానిసగా చేసి "యీ పనికి" ప్రోత్సాహమిస్తున్నాయి కూతురి పెళ్ళి చేయాలి. ఔను! లచ్చికి పెళ్ళి చేసేయాలి యీ దెబ్బతో... క్షణంసేపు లచ్చి అతని కళ్ళలో మెదిలింది అతనికి ఆవేశం అంచులు తెగి పొర్లింది. నీరసించిన చేతులు తిరిగి బలాన్ని పోసుకొన్నై. మెల్లిగా సొరుగుతీశాడు. అతని కళ్ళు జిగాలుమన్నై. వందరూపాయల నోటు!.. ఆ కాగితాన్ని చూడటం యిదే ప్రథమం అతనికి...అప్రయత్నంగా సొరుగులోనికి చొరవగా చేతులు చొరబడ్డాయి - తీసి వేశాయి - మెల్లిగా అంగలో అంగ వేసుకుంటూ గది దాటాడు - మిల్లు దాటాడు - చటుక్కున కాళ్లకు తీవ్రంగా పని చెప్పాడు ఎల్లప్ప.

* * *

"బాబూ."

"........"

"ఏఁవండి బాబూ" వణుకుతున్న స్వరంతోటి మెల్లిగా అన్నాడు ఎల్లప్ప

"ఆఁ" తలెత్తకుండానే కళ్ళజోడు పైనుండి చూచాడు సుదర్శనం. తత్తరపాటుతో చిత్తరచూపులతో దర్శనమయ్యాడు ఎల్లప్ప.

# ★ అంతా చేస్తే ఇంతేనా! ★

"ఏఁ?" అడిగాడు సుదర్శనం.

"ఆ...ఏమీ లేదు బాబూ" పెదాలు తెగ వణుకుతున్నై ఎల్లప్పకి.

"మరయితే ఎందుకురా పిలిచింది నన్ను?" గర్జించాడు సుదర్శనం.

బలవంతంగా పెదవులమీదకు చిర్నగవు తెచ్చిపెట్టుకొని, చేతులు నలుపుకుంటూ "అబ్బే, ఏమీ లేదు బాబూ! కొస్త వంద రూపాయిల నోటుకి చిల్లర దయచేస్తా రేమోనని" అన్నాడు ఎల్లప్ప. ఇలా అని మొలలో జాగ్రత్తగా ముడివేసి పెట్టిన వంద కాగితాన్ని సుదర్శనం చేతి కిచ్చాడు.

కాగితాన్ని అటూ యిటూ తిరగేసి చూచాడు సుదర్శనం. అతనికి తటుక్కున తన భార్య భవిష్యత్తు సినిమా బొమ్మ లాగా, కళ్ళల్లో మెదిలింది. తన భార్య యిప్పటికి యిరవైరోజు ల్నుండి మంచం పట్టింది. సరైన మంది ప్పించటానికి తనదగ్గర ఎర్రని ఏగానీ లేదు. ఎలాగైనా తన భార్యకు మంచి ట్రీట్ మెంటు చేయించాలి. ఇప్పుడున్న డాక్టర్ని మానిపించి పెద్దడాక్టర్ని పెట్టించాలి అందుకు డబ్బు అవసరం ఎంతైనా వుంది. తనకి. ఆలోచనల్లో పడి ఉక్కిరి బిక్కిరి అయిపోతున్న సుదర్శనం మెదడుకి ఎల్లప్ప అడిగిన మాటతో బ్రేక్ పండిది

"ఏం బాబూ, ఏమీ చెప్పరేం?" మళ్ళీ అడిగాడు ఎల్లప్ప.

"ఆఁ" కొస్త కంఠం సర్దుకొని, సులోచనాలు తుడిచి తిరిగి పెట్టుకొని, కనుబొమ్మలు కొస్త చిట్లించి, ముఖం కొద్దిగా ముడుచుకొని—

"నీ పేరేంట్రా?" అన్నాడు సుదర్శనం.

"నా పేరెందుకండి బాబూ."

"అవసరం వచ్చింది కనకనే అడుగుతున్నా" సింహంలా గర్జించాడు, క్రేప్ పెట్టె మీద చేతితో గట్టిగా గుద్దుతూ

పేరు చెప్పటానికి తటపటాయించాడు ఎల్లప్ప. చివరికి మెమ్మదిగా "ఎల్లప్ప" అని గొణిగాడు.

"సంతకం చేయటం వచ్చునా నీకు."

"అబ్బే...చాతకాదండి."

"మరయితే ఏం చేతనవునురా నీకు దొంగతనం చేయడం చేతవునా?" అన్నాడు సుదర్శనం; "సమాధానం ఏం చెప్తావ్" అన్నట్టు ఎల్లప్ప రెండు కళ్ళల్లోకి చూచాడు.

ఎల్లప్ప మాటాడలేదు.

సుదర్శనం గెట్టించాడు. "ఏంరా?"

"ఆ కాగితం నాదేనండి" అదురుతున్న పెదాలను అదిమిపెట్టలేక, చివరికి ప్రయత్నించి పలికాడు ఎల్లప్ప.

"ఏడిశావ్ లే! నిజం చెప్పు" మేఘంలా ఉరిమాడు సుదర్శనం.

"అబ్బే! నిజమేనండి!"

"అలాగైతే వుండు. ఆ నిజ మేమిటో పోలీసులద్వారా తెలుసుకుంటాను" అని, క్షణంసేపు ఎల్లప్ప వేపు చూచి "నీ వాలకానికి వంద రూపాయల నోటొకటిరా!" అన్నాడు సుదర్శనం.

ఎల్లప్ప ముఖం వివర్ణమయింది కాళ్లు వణుకుతున్నై. పోలీసులమాట వినేసరికి అలవిమాలిన భయం ఎల్లప్ప హృదయ కుహరంలో బయలుదేరింది చివరికి తడబడుతున్న స్వరంతో "నిజమేనండి, ఆ నోటు దొంగిలించాను" అన్నాడు. అని సుదర్శనం కళ్ళల్లోకి జాలిగా చూచాడు

సుదర్శనం ముఖం ప్రఫుల్లమయింది. యుద్ధంలో శత్రువును జయించినవాడిమల్లే విజయోత్సాహంతో వుప్పొంగిపోయాడు. అతని పెదవులపై చిర్నగవు చిందులు తొక్కింది. ఇంచుమించు సగం నెరిసిన బొద్దుమీసాల్ని ఒకసారి చేతి మునివేళ్లతో నాజూకుగా దువ్వి ఎల్లప్పవేపు దృష్టి నిగిడించి "భలేరా బేటా! మా మంచిపని చేశావ్! ఇక పో!" అన్నాడు సుదర్శనం.

ఎల్లప్ప మాత్రం స్తంభంలా అలానే నిల్చుండిపోయాడు సుదర్శనం మళ్ళీ హెచ్చరించాడు "పొమ్మంటే పోవేరా!"

ఈసారి ఎల్లప్ప సమాధానమిచ్చాడు "నా కాగితం!"

సుదర్శనం వికటాట్టహాసం చేశాడు. "అహ్హాహ్హా! ఏం కాగితంరా నీ మొహం. జైలు వూచలు లెక్కెడదామని వుందేట్రా నీకు! పో, త్వరగా పో! ఇక్కడ్నించి! యజమాని వచ్చే వేళయింది. ఆయన వచ్చేడంటే అంతపనీ చేసి తీరుతాడు. ఊఁ; పోఁ!"

ఎలప్ప కళ్ళల్లో నీళ్లు గిర్రున తిరిగినై. నీళ్లతో నిండిన కళ్ళతో ఒసారి సుదర్శనం వేపు చూచాడు ఏదో మాటలాడదామని నోరు విప్పాడు. కాని మాట పెదాలని దాటి పైకి రాలేదు.

ఎల్లప్పఅవస్థ సుదర్శనం గమనించక పోలేదు. తాను చేసేపని చెడ్డదని అతనికి

తెలుసు. కాని పరిస్థితుల ప్రాబల్యంవల్ల యీ నీచపుపనికి వెనకాడలేకపోతున్నాడు. పాపాత్ముడేమీ కాదు అతని హృదయం! మంచిగలవారికున్న మంచి హృదయం లాంటిదే అతనికీ వుంది. కాని పరిస్థితులికి బానిస అయిపోవడంమూలాన మంచి హృదయంచేత చెడుగా ప్రవర్తింప చేస్తున్నాడు సుదర్శనం, తాత్కాలికంగా...

పెట్టెలోనుండి అయిదు రూపాయల కాగితం ఒకటి తీసి ఎల్లప్ప వేపు చూస్తూ "ఇదిగో తీసుకో, యీ అయిదు రూపాయలూను. నేను కనక అమాత్రమైనా ముట్ట చెప్తున్నా! మరోడైతే అదీ వుండకపోను. నేనీపని చేయటానికి కారణం తెలుసునా? నాకు డబ్బు చాలా అవసరం కనుక..." అన్నాడు సుదర్శనం.

నిప్పు తగిలిన స్ప్రింగులా జవాబిచ్చాడు ఎల్లప్ప "నేను దొంగతనం చేసింది కూడా అంగులోసమేనండి!"

"ఛీ! నోర్ముయ్, నా కెంతవసరమో నీకేం తెలుసురా! ఇంక పోతావా, పోవా? పోలీసుల కప్ప చెప్పమంటావా?" అని అతి కఠినంగా పలికాడు సుదర్శనం.

ఎల్లప్ప మారు మాట్లాడలేదు సుదర్శనం యిస్తున్న అయిదురూపాయిలనోటు తిరస్కరించి గుడ్లనీరు కుక్కుకుంటూ అక్కడనుండి కదిలిపోయాడు. అతను వెళ్ళిన దిక్కువేపే చూస్తూ అలానే కూర్చుండిపోయాడు సుదర్శనం.

* * *

ప్రొద్దున్న జరిగిన సంఘటనవల్ల విరిగిన మనస్సుతో యింటికి చేరుకొన్నాడు సుదర్శనం ఆ వేళ సాయంత్రం. ఇంటికి వచ్చీ రాగానే పెద్దకూతురు ఎదురై "నాన్నా, మాకు భయమేస్తూంది అమ్మని ఎంత పలకరించినా పలకటంలేదు. ఇప్పుడే నిన్ను తీసుకురమ్మని తమ్ముణ్ణి పంపించేను" అన్నది గాబరాగా

కూతురు చెప్పిన వార్తతోటి ఖంగారూ పడిపోయాడు సుదర్శనం. గబగబా గదిలోకి వెళ్ళి భార్యచేతిని ఓమారు పరీక్షచేసి, ఆమెను పలకరించాడు. కాని ఆమె పలకలేదు. ఆరాటంతో డాక్టరు దగ్గరికి బయలుదేరాడు, చురుకుగా అంగలు వేసుకొంటూ.

అయిదురూపాయలు విజిటింగ్ ఫీజు చెల్లించి ఆ వూరిలోని ఒక పెద్దడాక్టర్ని తీసుకువచ్చాడు సుదర్శనం.

స్టెతస్కోపుతో గుండెలు ఓమారు పరీక్షించి, పెదవివిరుస్తూ "కేస్ చాలా సీరియస్‌గా వుందండీ" అన్నాడు డాక్టరు.

"అయితే ఏమంటారు" అని అనలేదు సుదర్శనం, అతనికళ్ళే అని వేసినై!

ఆతృతగా చూస్తూన్న సుదర్శనం కళ్ళలోకి సూటిగా చూస్తూ "ఈ కేసు బాగు చేయటానికి కొన్ని యీమధ్యనే కనిపెట్టబడిన యింజక్షను లివ్వాలి, ఏమంటారు?" అని అడిగాడు డాక్టరు.

సుదర్శనం ఒక్కసారి తన జేబులోకి చేయిపోనిచ్చాడు. అంతవరకూ క్షేమంగా వున్న వందరూపాయిల కాగితం అతని చేతి వ్రేళ్లకు తగిలింది. వెనువెంటనే జేబులోనుండి చేయి తీసివేసి "తప్పకుండా ఇవ్వండి యింజక్షన్లు. నా భార్యను బ్రతికించే భారం మీది డాక్టర్" అన్నాడు సుదర్శనం కంపిత స్వరంతో.

ఆతర్వాత డాక్టరు ప్రిస్క్రిప్షను రాసి అది సుదర్శనానికిస్తూ "ఇవి వేగంగాతీసుకరండి, మీరు వచ్చేవరకూ నిరీక్షిస్తూంటాను" అన్నాడు.

సుదర్శనం ఆ కాగితం తీసుకొని చీకటిలో అదృశ్యమైపోయాడు.

పది పన్నెండు నిమిషాలు గడిచిన తరువాత యింజక్షన్లతో ప్రత్యక్షమయ్యాడు సుదర్శనం.

అవి చేత్తో తీసుకొంటూ సుదర్శనాన్నుద్దేశించి అడిగాడు డాక్టరు "అయితే డబ్బెంతయిందండీ మందులికి?"

"మొత్తం డెబ్భయిఅయిదు" అని గొణిగాడు సుదర్శనం.

"పది రూపాయలు ఎక్కువ కొట్టేశారండి ఆ వెధవలు. వాళ్ల ఖరీదు అరవై అయిదే"

"మరయితే అసలు ఖరీదు నాకు ముందు ఎందుకు చెప్పలేదు" అని అడుగుదామనుకున్నాడు సుదర్శనం. కాని అడగలేదు.

డాక్టరు ట్రీట్‌మెంటు ప్రారంభించాడు. ఒకటి తర్వాత మరొకటి యింజక్షనులు యిస్తున్నాడు రోగికి. రెండు గంటలు గడిచిన తర్వాత కుర్చీమీదనుండి లేస్తూ "ఇక నేను వెళ్తానండీ; రోగికి బహుశా ఫరవాలేదు! ఈలోపున అవసరం వస్తే నాకు కబురుచేయండి. ప్రొద్దున్నే వచ్చిచూస్తా" అన్నాడు డాక్టరు.

డాక్టరు లేచి గుమ్మంవరకూ వెళ్ళి తటుక్కున వెనక్కు తిరిగి సుదర్శనంతో "మరి నా బిల్లు యిస్తారా!" అన్నాడు.

ఇప్పుడు వచ్చాడోలేదో అప్పుడే డబ్బుకోసం తొందరచేస్తాడనుకోలేదు సుదర్శనం. అతనికి అంతులేని ఆశ్చర్యం కలిగింది. కాని ఏం చేస్తాడు—

సుదర్శనం "బిల్లు ఎంత" అని అడిగేలోపల డాక్టరే చెప్పాడు- "ఇరవై రూపాయలు"

సుదర్శనం మారుమాటాడకుండా జేబులోనుండి రెండు పదుల కాగితాలు తీసిచ్చేశాడు డాక్టరుకి...

డాక్టరు వెళ్ళిపోయిన మరుక్షణంలోనే, అంతసేపూ తల్లిదగ్గర కూచునివున్న పెద్ద కూతురు "అమ్మా" అని పొలికేక పెట్టింది. ఆ కేకకు వులిక్కిపడ్డాడు సుదర్శనం. గబగబా భార్యమంచందగ్గరకొచ్చి ఆమె చేతిని చూచాడు. చేయి చల్లగా తగిలింది...

సుదర్శనం కళ్ళల్లో నీళ్లునిండినై. కన్నీళ్లు చెక్కిలిమీద జలజలా జారిపోయినై కిందికి. అతని ముఖం కన్నీటితో తడిసి గుడ్డిదీపపు కాంతిలో మెరుస్తున్నది. అకస్మాత్తుగా



# అంతా చేస్తే ఇంతేనా!



అతని కళ్ళల్లో ఎల్లప్ప కదిలాడు. ఎల్లప్ప జ్ఞప్తికి రాగానే అతని ఆవేదన అధికమైంది. అక్రమంగా అతనివద్దనుండి వంద రూపాయలు లాక్కున్నాడు తను. లాక్కొని తను బావుకున్నదేమిటి? ఆ డబ్బంతా బూడిదలో పన్నీరైపోయింది. తన భార్య బ్రతకలేదు. చూస్తూచూస్తుండగానే వందరూపాయలూ కరిగి తరిగి మాయమైపోయినై. ఇంతకూ అసలు కారకు డెవరు? తనా? ఊహూఁ, కాదు! ఎల్లప్పా కాదు! అంతకీ కారకుడు డాక్టరు...అతనే తన భార్యను చంపేశాడు! వంద రూపాయలు అతనే మాయంచేశాడు! ఇంత దగా చేస్తాడా?—

సుదర్శనం పళ్లు పటపట కొరికాడు. అతనిలో తీవ్రప్రతీకారవాంఛ ప్రబలింది. గబగబా అంగలు వేసుకుంటూ డాక్టరు కోసం బయలుదేరాడు.

* * *

"ఎవరు నువ్వు? ఎవర్నీ అడక్కుండా అలా లోనికి పోతావేఁ?" అటకాయించాడు కాంపౌండరు.

చటుక్కున ఆగాడు సుదర్శనం. కాంపౌండరువేపు తీక్షణంగా చూస్తూ "డాక్టరు కోసం; నేనెవరినైతే నేం, అదంతా నీకు అనవసరం" అన్నాడు గంభీరంగా.

"అలానైతే యిక్కడే వుండు; లోపలి కెళ్లకూడదు"

"ఎందుచేత" అని అడిగాడు సుదర్శనం.

"ఎవరో రోగిని పరీక్షిస్తున్నారు డాక్టరుగారు. ఆ పనైనతర్వాత బయటకి వస్తారు. అప్పుడు—" ఇంకా ఏదో అనబోతున్నాడు కాంపౌండరు అతని మాటకు అడ్డుతగిలాడు సుదర్శనం "ఊఁ, చాల్లే" అని ఓ బెంచీమీద చతికిలబడ్డాడు.

పావుగంటసేపు గడిచింది—

ఇంతలో తలుపుతోసుకొని హఠాత్తుగా బయటికి వచ్చినమనిషి - సుదర్శనం యింతసేపటినుండీ ఎదురుచూస్తూన్న డాక్టరు — కాడు. అతడు ఎల్లప్ప!

తెల్లబోయాడు సుదర్శనం. "ఎల్లప్పా" అని అప్రయత్నంగా అనేశాడు.

ఎల్లప్ప బాధగా మూల్గుతూ అన్నాడు "హాఁ, నేనే!"

సుదర్శనం లేచి గబగబా వెళ్ళి అతని చేతులు పట్టుకొని "నన్ను క్షమించు ఎల్లప్పా" అన్నాడు.

"ఊఁ" అని మూలిగాడు ఎల్లప్ప.

"ఏం? అలావున్నావు? ఏమొచ్చింది నీకు" అని అడిగాడు సుదర్శనం ఆతృతగా.

"తర్వాత చెప్తానండి, పదండి" అంటూ బయటికి నడిచాడు ఎల్లప్ప. పిచ్చిగా అనుసరించాడు సుదర్శనం తను వచ్చిన పనిని ఓమూల మూటగట్టి పెట్టి...

అప్పుడే ఏటివారనున్న "టవర్ క్లాక్" ఠంగుఠంగుమంటూ పదిగంటలు కొట్టింది, గాఢ నిశ్శబ్దాన్ని భగ్నపరుస్తూ. ఆ శబ్దం విన్న సుదర్శనం వళ్లు ఝల్లుమన్నది. దూరాన నింగిమీద తారకలు మిలమిలా మెరుస్తున్నాయి. చంద్రుడు మానవుల కష్టాల్ని చూడలేక కాబోలు మబ్బుల్లో దూరి దాక్కున్నాడు. ఆకాశం మేఘావృతమైంది. కొద్దికొద్దిగా వానతుంపరలు రాలటం మొదలుపెట్టాయి. వానతుంపరులకు తారురోడ్డు క్రమంగా తడుస్తూవుంది. దానిమీదనే నడుస్తున్నారు ఎల్లప్పా, సుదర్శనమూ.

సుదర్శనం తనకు జరిగినదంతా ఎల్లప్పతో చెప్పి కళ్ళనీళ్లు కుక్కుకున్నాడు. నడుస్తూ నడుస్తూ చటుక్కున సుదర్శనం ఆగి "అయితే నువ్వాసుపత్రి కెందుకొచ్చావ్!" అని అడిగాడు.

ఎల్లప్ప కళ్లల్లో నీళ్ళుబికాయి. చిరిగి బాగా చివికిపోయిన ధోవతితో కళ్ళు తుడుచుకొని "సుదర్శనంగారూ! నే నసలు చావలేక బ్రతుకుతున్నానండి...ఇప్పుడు నే నే ఆశతోటీ జీవించటంలా. ఇంతవరకూ నా లచ్చికి పెళ్ళిచేసి కనులవిందు చేసుకొందామన్న ఆశతో జీవించేవాణ్ణి. కాని యిప్పుడు...యిప్పుడు ఆ ఆశ పోయింది. మా మేనేజరు అమూకీలాగాడు. నేను దొంగనని నిర్ధారణ చేశారు. తర్వాత డబ్బేదని అడిగాడు - లేదన్నాను. చావ తన్నించాడు...ఆ తర్వాత తోటిపనోళ్లు నామీద జాలితలచి యీ ఆసుపత్రికి తీసుకొచ్చారు నన్ను" అన్నాడు. ఇలా అని సుదర్శనంవేపు చూచాడు.

సుదర్శనం కన్నీళ్ళు విడుస్తున్నాడు. కన్నీటిని తుడుచుకొంటానికి ప్రయత్నించకుండానే ఎల్లప్పని అడిగాడు "వాళ్లు డబ్బు ఏది అని అడిగినప్పుడు నా పే రెందుకు చెప్పావు కాదూ?"

"నాపని ఎలాగా పోయింది. మీ పేరు చెప్పి డబ్బు యిచ్చివేసినా మళ్లీ నాకు పని యిస్తారని నమ్మకం నాకు లేదు. అటువంటప్పుడు వృథాగా మిమ్మల్నిందులో యిరికించటం దేనికి? ఆపైన మీ యజమానికి తెలిస్తే మీ పనికి కూడా ముప్పొస్తాది" అన్నాడు ఎల్లప్ప.

ఎల్లప్ప విశాల హృదయానికి సుదర్శనం ఆశ్చర్యపోయాడు. నిజమే! తన పేరు చెబితే నిజంగా ముప్పొచ్చేవుండును. అసలే తన యజమాని మంచిమనిషి కాడు - ఎల్లప్ప తనకుచేసిన మేలుకి ఏమి చేయాలో సుదర్శనానికి తోచలేదు. ఏవిధంగా కృతజ్ఞత చూపాలో తెలీలేదు.

ఎల్లప్ప మళ్ళీ అన్నాడు "ఇప్పుడు నాకు జీవనాధారం అసలే లేదు. వున్న కాస్త పనీ పోయింది...ఇకముందు తిండానికే కూడు దొరకదు. ఇంక నా లచ్చికి పెళ్ళేలా సెయ్యను?"

నిరాశగా నిట్టూర్చాడు ఎల్లప్ప. అతడి మాటలు సుదర్శనం హృదయాన్ని గాయపరచినై. ★




## ఆత్మవిశ్వాసం

 

### కౌమారి — ఉషారాణి

"ఏం సుమిత్రా! మళ్లీ అలా కూర్చున్నావు? అక్కయ్యతో ఏమైనా పోట్లాట వచ్చిందా?"

"నువ్వు నన్ను అలాగే అడుగుతున్నావా? ఎంత ప్రయత్నిస్తున్నా ఈ మనస్పర్థలు తప్పటం లేదు. అక్కయ్య నన్ను సరిగ్గా అర్థం చేసుకోవటము లేదు."

"ఇటు చూడు సుమిత్రా నే ఒక్క విషయం చెబుతా విను. మనం ఈ జీవితంలో పొరబాట్లు చెయ్యకుండా వుండాలనీ అందుకు ఎంతో నిగ్రహశక్తి ఉదాత్తత కావాలనీ కొందరు అంటారు. కానీ అంత కంటె కష్టమైనదీ మన హృదయ సైర్థ్యాన్ని తెలిపేదీ ఒకటివుంది—మనం తప్పులు చేసినప్పుడు ఎదటివారిని క్షమాపణ కోరుకోవటం. నిన్ను చూస్తుంటే నాకు ఓ కథ జ్ఞాపకమొస్తోంది. చెబుతా విను:—

"అందులో నాయిక ఆరేళ్ల ప్రాయము ప్పుడు ఒక అనాథ బాలికగా మనకు పరిచయమవుతుంది. ఆ అమ్మాయికి ప్రపంచంలో 'నా' అనే వాళ్లుండరు. దూరపు బంధువులలో ఒక జమీందారిణి యింట్లో ఆశ్రయం దొరుకుతుంది. వార్ధక్యంలో వున్న ఆ యిల్లాలు ఆ పిల్లని ప్రేమతో ఏలోటూ లేకుండా చూచుకుంటుంది. కానీ వచ్చిన చిక్కల్లా ఆమె కొడుకు దగ్గిరే దాదాపు ముప్పయ్యేళ్లుంటాయి అతనికి, కోపిష్ఠి. అందరినీ హింసిస్తూవుంటాడు. ఎదటివారు బాధలో గిలగిలా తన్నుకుంటూంటే చూసి ఆనందపడతాడు. మనుష్యుల్లో, వారి మంచితనంలో నమ్మకంగాని కారుణ్యంగాని లేని కఠినుడు.

"కేవలం తన యింట్లో ఆశ్రయం కోరి వచ్చిన ఆ ఆరేళ్ల బాలికని చులకనగా చూస్తాడు. ఆమె విషయం ఎక్కువ పట్టించుకోడు. తల్లి ఎంత బతిమాలుతున్నా వినకుండా విదేశం వెళ్లి పదేళ్ల తరువాత ఆ యింటికి తిరిగివస్తాడు."

"ఆ పదేళ్లలోనూ నాయికకి ఆ యింట్లో ఒక విశిష్టస్థానం ఏర్పడుతుంది. శాంతి సౌమ్యాలు ముఖాన ఉట్టిపడుతూ, సుగుణాలు మూర్తీభవించిన ఆమె యింట్లో ఒక దేవతలా తిరుగుతూ వుంటుంది. కఠినుడూ క్రూరుడూ అయిన అతను అది భరించలేక పోతాడు.

"ఎల్లాగైనా ఆమె వ్యక్తిత్వాన్ని అణగద్రొక్కి ఉదాత్తమైన ఆమె చరిత్రకు కళంకం ఆపాదింపచేయాలని విశ్వప్రయత్నం చేస్తాడు. ఆమె విశ్వసించతగనిదని అబద్ధికురాలని నిరూపించాలని ప్రయత్నిస్తాడు. అంటే సామాన్యంగా జుగుప్స కలిగించేటట్టు ఆమెను వెంటాడి బలాత్కరించడు. దొంగ ప్రేమ నటించి మోసగించడు. ఆమెలో పైకి కనబడుతున్నంత గుణశీలములు లేవని బుజావు చెయ్యడంకోసం తాపత్రయపడతాడు."

"అతను ఏ వుద్దేశంతో అలా ప్రవర్తిస్తున్నాడో ఆమెకు తెలియకపోయినా, అతన్ని మెప్పించాలనే ఆలోచన లేకుండానే, ప్రతిక్షణం తన ఉదాత్తతని నిరూపిస్తూ ఆ యువతి అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తుంది.

"అప్పటికి ఆమెకి పద్దెనిమిదేళ్లు. మారుపేరుతో పత్రికలకు రచనలు పంపుతూ వుంటుంది. ప్రచురితమయే తన రచనలను చదివి పరులు విమర్శిస్తూంటే శ్రద్ధగా వింటూవుంటుంది. ఆ విషయం మరెవ్వరికీ తెలియదనుకుంటున్న ఆమెకి ఒక విచిత్ర సంఘటన ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఒక రోజు ఒంటరిగా కూర్చుని పియానో వాయించుకుంటూ వుంటుంది. టేబిలుమీద ఒక కవరు కనబడుతుంది. జమీందారిణి కొడుకు పేర పత్రికా

(30-వ పేజీ చూడండి)





"జీవనతరి తేలిపోవును
మందాక్రాంతా తాళమున....

—[illegible]



కాశీ వద్ద గంగ దృశ్యం

ఫొటో : సి. సీతారాం, మద్రాస్.

ప్రకాశకుడు వ్రాసిన ఉత్తరమది. దస్తూరి గుర్తు పడుతుంది. ఇంట్లో ఎవరూ వుండరు. ఆ కవరు చేతులోకి తీసుకుని ముఖం దగ్గరగా పెట్టుకుని పరీక్షిస్తుంది. ఆ గదిలోనే తెరవెనుక నిల్చుని అంతా గమనిస్తున్న అతను "ఇంకేముంది. తీసి చదువుతుంది" అనుకుని విజయగర్వంతో ఎదురుచూస్తుంటాడు. కానీ ఆమె దాన్ని యథాస్థానంలో పెట్టేస్తుంది. ఎలాగైనా ఆమెచేత తప్పులు చేయించాలనీ, క్షమాపణ కోరుకునేట్లు చేయాలనీ ప్రయత్నించే అతని కఠిన హృదయానికి చంద్రకిరణాలని ప్రసరింపజేస్తుంది ఆమె ప్రవర్తన. ఎటువంటి సంకల్పమూ, ప్రయత్నమూ లేకుండానే అతనిలో హృదయపరివర్తన కలుగుతుంది. ఇటు ప్రత్యక్షంగా ఎదుట నిలబడి పోట్లాడదు. వాదించదు. 'నీలో కాఠిన్యముంది. అది పోగొట్టుకో' అని వేలెత్తి చూపదు. అటు అతని ప్రేయసిగా మంచి నీతిబోధ చెయ్యదు. బానిసగా కష్టాలను అనుభవించదు. అతన్నెలాగైనా మార్చి వెయ్యమనీ, ఆత్మకు శాంతినియ్యమనీ చేతులెత్తి భగవంతుని మాత్రం ప్రార్థిస్తుంది.

"ఆమె ఒక్కసారి నవ్వితే చాలుననీ తలవూపితే చాలుననీ ఎదురుచూస్తూ, యువకులు ఆమెను వివాహమాడటానికి సిద్ధపడతారు. కానీ ఆమె వారెవ్వరినీ ప్రోత్సహించలేకపోతుంది. ఎవరినీ తనకి తగిన వరునిగా ఎంచుకోలేకపోతుంది. ఆమె మీద అత్యంత గౌరవాభిమానాలుగల ఒక పురుషుడు వివాహం చేసుకోమని అడిగితే సరేననలేకపోతుంది.

"వివిధంగా చూసినా తనమీద మమకారం కలగటానికి వీలులేని ఆ అమ్మాయినే చివరికి ప్రేమిస్తాడు జమీందారిణి కొడుకు. ఒక వైపు ఆమెను పొందలేననే దృఢనమ్మకమూ బాధా, మరోవైపు మార్చుకోలేని తననిజస్వభావమూ. ఈ రెండింటి మధ్యా నలిగిపోయే నాయకునిపట్ల పాఠకులకు జాలి కలుగుతుంది. ఆఖరుకి మరో స్త్రీని ప్రేమించినట్లు నటించైనా, ఆమెలో అసూయని రెచ్చగొట్టాలనీ, తనమీద ఏమాత్రం మమకారముందో పరీక్షించాలనీ ప్రయత్నిస్తాడు. కాని అందులోనూ విఫలుడౌతాడు.

"గతంలో జరిగిన ఒక విషాద సంఘటన అతన్ని దుర్బలునిగా చేస్తుంది. అతని గాయానికి కట్టుకట్టి, అతను జీవితంలో ఇన్నాళ్లుగా చవిచూడని ప్రేమతో వాత్సల్యంతో కారుణ్యంతో జీవితంలోని పవిత్రవిలువలతో అతన్ని మరో ప్రపంచానికి తీసుకుపోతుంది ఆమె. అతనికీ హృదయముందని నిరూపిస్తుంది.

"ఇదీ కథ. నేను ఆ పుస్తకం చదువుతూంటే 'క్రైస్తవమత బోధ ఎక్కువగా వుంటుందనీ, రచయితకి అంతగా పేరు ప్రఖ్యాతులు లేవనీ, తలోకరూ తలోవిధంగా వ్యాఖ్యానాలు చేశారు. నాలో పారస్వతాభిలాష కలిగించటానికి ప్రఖ్యాత రచయితలు రచయిత్రుల పేర్లు కొన్నింటిని కొందరు సూచించారు. వాటిలో కొన్నింటిని చదివే అవకాశం కలిగింది నాకు. కానీ ఈ నవల వాటికంటె ఏదో భిన్నంగా కనిపించింది

"ఒక స్త్రీకోసం యిద్దరు పురుషులుగానీ ఒక పురుషుడికోసం యిద్దరు స్త్రీలుగానీ ఘర్షణపడటం ఈ నవలయొక్క ఇతివృత్తం కాదు. ఒక్క అసభ్య సన్నివేశం లేదు. ముఖ్యపాత్రలు ఆవేశంతో ప్రవర్తించే ఘట్టం లేదు. కానీ ఇందులోనూ ఒక నాయిక వుంది. నాయకుడున్నాడు. వాళ్లూ ప్రేమించుకుంటారు. చివరికి వివాహం చేసుకుంటారు."

సుమిత్ర దుఃఖం ఆపుకుంటూ మాదగ్గరకు వచ్చినప్పుడు నా స్నేహితురాలు సీత చెప్పిన ఈ కథ నాకు కొంత ఆశ్చర్యం కలిగించింది. కథలోని నాయికకి ఎంతో ఉదాత్తత వున్నమాట నిజమే. కానీ కఠినుడైన ఒక వ్యక్తిలో ఆమె పరివర్తన తెచ్చిన తీరూ, ఆ ఆత్మ సౌందర్యమూ సామాన్యులలో గోచరిస్తుందా అనే సంశయం కలిగింది.

ఆశయాలు ఎంత ఆకాశాన్నంటుకుంటున్నా, వాస్తవ జీవితంలో అడుగుపెట్టిన తరువాత ఆత్మీయులే మనస్పర్థలను తప్పించుకోలేకపోవటం మనం చూస్తూనే వుంటాము. సుమిత్రనీ ఆమె అక్కనే తీసుకుందాం. సాక్షాత్తూ ఒక తల్లికి కలిగిన పిల్లలు. ఒక యింట్లో వుంటున్నారు. తమకి చెడు తలపెట్టేవారిని ప్రేమించాలనీ, ఒక చెంపనుకొడితే మరో చెంప చూపించాలనే నీతిబోధనలతో నిండిన కథలు వాళ్ళూ చదివారు. కానీ వాస్తవజీవితంలో అడుగు పెట్టగానే ఆ ఆశయాలు తల్లక్రిందులయ్యే ప్రమాదం తప్పలేదు కాబట్టే, మనస్పర్థలు కలిగాయి. కొన్ని తెలిసీ కొన్ని తెలియకా పొరబాట్లు చేస్తున్నారు. పరస్పరం నిందించుకునీ అపార్థం చేసుకునీ బాధపడుతున్నారు. ఆ పరిస్థితులు ఎప్పుడో ఒకప్పుడు మారతాయనీ, మళ్లీ వాళ్ళిద్దరు చెయ్యీ చెయ్యీ కలుపుకుని ఆప్యాయంగా కబుర్లు చెప్పుకోక మానరనే విషయం మనకే కాదు వాళ్లకీ తెలుసు. కానీ వారి మనస్సులలో ఇప్పుడు క్షోభ తప్పటంలేదు.

కథలోని నాయికపాత్ర పైకి కొంత వాస్తవానికి విరుద్ధంగా కనబడినా, సూక్ష్మంగా ఆలోచిస్తే ఒక్క విషయాన్ని స్ఫురింపజేస్తుంది. ప్రతిఫలాపేక్ష లేకుండా, పరులని మెప్పిస్తున్నానా లేదా అనే ఆలోచనే లేకుండా, కేవలం మనుష్యుల మంచితనంలో తనకున్న విశ్వాసంతోనే నాయకుని పొందింది. ఆ దృఢనమ్మకమే ఆమె మనసులో ఎలాటి అశాంతీ లేకుండా చేస్తుంది. బాహ్యశక్తులూ ఆమెను కదిలించలేకపోతాయి. అటువంటి గాఢనమ్మకమే, పరులు తమని కొంత అపార్థం చేసుకుంటున్నా, నిరుత్సాహపడకుండా సర్దుకుపోయే స్వభావాన్ని కలుగజేస్తుందని తోచింది.







వనితాలోకం సీరియల్



# స్వయంసిద్ధ



## 22

హరినారాయణబాబు ఒక పెద్దగదిలో మంచంమీద మైకంలో ఉన్నట్లు పడుకుని ఉన్నాడు. మాధురీదేవి, మృణాళిని మరికొంతమంది స్త్రీలు అతడిచుట్టూ కూర్చుని పరిచర్యలు చేస్తున్నారు. వృద్ధుడైన ఆస్పత్రిలోని అసిస్టెంట్ డాక్టరు - కొంతమంది సహోదరులతో దగ్గరలోనే కూర్చుని, మందులవిషయమై ఆలోచిస్తున్నాడు.

"మామగారూ!"

సుపరిచితమైన ఈపిలుపుతో రోగి మైకం వెంటనే వదిలిపోయింది. కళ్లు తెరిచి ఆప్యాయంగా 'అమ్మా చండీ!' అన్నాడు మెల్లిగా.

చండి విస్సంకోచంగా సరాసరి మామగారిమంచంమీదికివచ్చికూచుని, నెమ్మదిగా ఆయన పాదాలను తన ఒడిలోకి తీసుకుంది.

చండి అత్తగారికేసి చూస్తూ "ఏం జరిగింది అత్తయ్యా!" అని అడిగింది

రాణి దీర్ఘంగా నిట్టూర్చి, "హఠాత్తుగా తల తిరిగి పడిపోయారు. అయినా దేముడి దయవల్ల వారంతట వారే అపాటును కొంతవరకు తమాయించుకున్నారు. పెద్ద దెబ్బ యేమీ తగల్లేదు. కాని తలత్రిప్పుమాత్రం ఇంకా తగ్గలేదు" అన్నది.

చండిముఖం వివర్ణమైపోయింది. "డాక్టరు ఏమన్నారత్తయ్యా?" అని అడిగింది.

"వాళ్లు పైకి యేమీ చెప్పలేదు. తలకు మంచుగడ్డ తీసుకొచ్చి పెట్టుతున్నారు. ఒక ఇంజక్షన్ కూడా ఇచ్చారు. విసు డాక్టరు గారొస్తేనేగాని అసలిది ఏంజబ్బు అయినదీ తెలుసు"

"వారింకా ఎందుకు రాలేదు?" - అని చండి వ్యగ్రకంఠంతో ప్రశ్నించింది.

"ఆయన ఊళ్లోలేరు. అయినా ఈసుస్తీ చెయ్యక ముందు - ప్రొద్దునే - ఆయన్ని యెంగుకో రమ్మని కబురు పంపించారని విన్నాను. తెల్లారేసరికి వచ్చేస్తారు"

అక్కడ ఉన్నవారినందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేస్తూ "అమ్మా! నువ్వు నిద్రలోనే ఉన్నావల్లే ఉందే ఇంకా?" అని ప్రశ్నించాడు మామగారు.

"లేదు, మామగారూ! నేను మెలుకువగానే ఉన్నాను. కాని మీరు మెదలకుండా పడుకోండి, మాట్లాడొద్దు"

"అయితే మరి నిన్నెందుకు పిలిచాననుకున్నావమ్మా? ఇవాళసలు కబురంపవలసింది కాదింకా నీకు...ఇవి మహాలయపక్షపురోజులు. దేవీనవరాత్రాలు రావటానికింకా వ్యవధిఉంది. కాని తప్పనిసరియై నిన్ను అసమయంలో పిలిపించాల్సివచ్చిందమ్మాయీ!" అన్నాడు మామగారు గట్టిగా.

రోగి ఇలా మాట్లాడుతూ ఉండటం చూసి, చేతులో ఉన్న పనివదిలేసి, డాక్టరు దగ్గిరకి పరుగెత్తుకొచ్చాడు. అతను వైద్యుడిగా తన బాధ్యతని గుర్తెరిగి, సవినయంగా "అదేమిటి ప్రభూ! మీరిప్పుడు ఒక్కమాటకూడా మాట్లాడకూడదు - అది ప్రమాదం" అని మనవిచేశాడు.

రోగి ఎర్రబడ్డకళ్లతో డాక్టరుకేసి తీక్షంగా చూశాడు. వెంటనే అదే ధోరణిలో "జీవితంలో ఎన్నడూ . ఎవరి ఆజ్ఞనూ మన్నించి యెరగను డాక్టర్! ఇవాళ రోగిని కదా అనే నెపంతో నువ్వు నాకు అడ్డుచెప్పవచ్చావా?" అన్నాడు

డాక్టరు చేతులు రెండూ జోడించి, "పొరపాటయింది నాది. తమరు ఇంక ఊరుకోండి." అని విన్నవించాడు.

రోగి తర్జనితో శాసిస్తూ "ఊరుకోనా? ఇప్పుడా?" అంటూ వికృతకంఠంతో బిగ్గరగా నవ్వుతూ "పందెపు గుర్రం దానిచిత్తం వచ్చినట్లు పరుగెత్తుతుంది. దాన్ని ఆపటం నీ తరమా? నిర్ణీత స్థలానికి చేరుకున్నాక దానంతటదే ఆగుతుంది" అన్నాడు.

డాక్టరికి రోగిస్వభావం తెలుసు. అంచేత ఆయన్నింక కదిలించకుండా తన చోటులోకి వెళ్ళాడు.

"డాక్టరు పారిపోయినాడల్లే ఉంది అమ్మ! ఆఁ! పారిపోక తప్పదు. ఆఁ! అదేమిటి - ఆయుర్వేదాచార్యుడి కూతురు కళ్లు ఎర్రచేసి ఏదో మాటను కప్పిపుచ్చుతోందల్లే ఉందే! హ్హ హ్హ హ్హ! కాని ఈ మాటవిని నువ్వుకూడా కోపం తెచ్చుకోలేదుకదా అమ్మాయీ?"

"మామగారూ!"

ఆమె యీ పిలుపులో కేవలం సంబోధన మాత్రమే వ్యక్తం కాలేదు. ఇంకా యేదో కూడా ఉంది. ఈ ఔద్ధత్యంతో కూడిన పిలుపు రోగి చెవుల్లో ఉన్మత్తస్వరంలాగా గింగిర్లెత్తించింది. అతడు ఉద్వేల కంఠంతో - "ఓహో! ఇలాంటి పిలుపే నేను వినతలచింది అమ్మాయీ!" అన్నాడు.

చండి తన స్నిగ్ధస్వరాన్ని కొంచెం తీక్షంగా మార్చుకుని, "మీరు ఎన్నడూ ఎవరిఆజ్ఞ[illegible] మన్నించి యెరగరని మా కు

మూలం : మణిలాల్ వంద్యోపాధ్యాయ    అనువాదం: మద్దిపట్ల సూరి





# స్వయంసిద్ధ



తెలుసు. కాని ఇప్పుడు మీరు నన్నుంచి తీరాలి మామగారూ! మీ రొక్కమాట కూడా మాట్లాడటానికి వీల్లేదు. మరీ మాటను లక్ష్యపెట్టకపోతే, మేమంతా ఇప్పుడే ఇక్కడనుంచి లేచి వెళ్లిపోతాం" అన్నది.

యజమాని మెల్లిమెల్లిగా చెయ్యి పైకి లేపుతూ - "అది నాకు తెలుసునమ్మా! నువ్వు ఏదయినా చెయ్యగలవు. డాక్టరికి భయపడనుకాని, నీకు మాత్రం భయపడతాను" అన్నాడు.

"అయితే మేమంతా లేచి వెళ్లిపోవాలనే మీకు కోరికగా ఉన్నదా?" అని అడిగింది చండి.

"లేచివెడతారా! నువ్వు ఏమనుకుంటున్నావ్! నాకు ఉపచారం చేయించుకోటానికే నిన్ను పిలిపించాననుకుంటున్నావా? నాకు ఏమాట చెప్పాలంటే నాలిక పీకుతోంది - దాన్ని నువ్వు వినితీరాలి. వినకపోతే నీకూ నిష్కృతిలేదు, నాకూ నిష్కృతిలేదు" అన్నాడు రోగి వికృత కంఠంతో...

"కాని ఏమైనా చెప్పటానికిదేనా సమయం మామగారూ?"

యజమాని వెనకటిలాగానే వికృతంగా నవ్వుతూ "సమయంకూడా ఇంచుమించు నాలాంటిదే! ఎవరెంత అడ్డుపడబోయినా ఆగదు. ప్రమాదంగా పరిణమిస్తే దాన్ని యెవరూ పట్టుకోలేరు. ఆ! అసలు నిన్ను పిలిపించింది ఎందుకో చెపుతాను. దానంతటదే తెల్లవారిపోబోతోంది అమ్మాయీ! తెల్లవారనీకుండా ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు. కలెక్టరును వెంటపెట్టుకుని కమీషనర్ దొరగారు వేటకోసమని వస్తున్నారు రేపు ప్రొద్దున్నే వారు వస్తారిక్కడికి -" అన్నాడు.

మళ్ళీ యజమానిముఖంలో వేదనా చిహ్నాలు కన్పించాయి ఆయన తన వక్తవ్యాన్ని పూర్తి చెయ్యటానికి అవకాశం చిక్కలేదు.

చండి చటుక్కున ముందుకు వంగి, మామగారి ముఖాన్ని చేత్తో నిమరసాగింది. ఆమె దృష్టిఅంతా మామగారి ముఖంమీదనే ఉంది. కొన్నిపటివరకూ ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు.

చండి మామగారికి మాట్లాడేందుకు అవకాశం ఇవ్వకుండా, "మీ స్వభావాన్ని నేను అర్థంచేసుకున్నదాన్నిబట్టిచూస్తే - కమీషనర్ దొరగారికి ఇక్కడ మర్యాద చెయ్యటంలో ఏదైనా పొరపాటు జరుగుతుందేమో అనే మీరింత కలతపడుతున్నారంటే నేను విశ్వసించలేకుండా ఉన్నాను మామగారూ!" అన్నది.

చండి మాటలకి యజమానిముఖంలో చటుక్కున నవ్వు తళుక్కుమంది. ఆయన ఉత్సాహంతో - "నువ్వు చాలా ఘటికురాలివి రోగాన్ని సరీగ్గా పట్టుకున్నావు. కమీషనర్, కలెక్టరూ - ఇక్కడికి వేటకోసమని రావటంలేదు అమ్మాయీ! విచారణకోసమని వస్తున్నారు" అన్నాడు.

ఆమాట రోగి గదిలో ఉన్నవారినందర్నీ చకితుల్ని చేసింది. చండి మామగారి

ముఖం కేసి చూస్తూ "అలాంటి అధికారం వారి కిప్పటికీ ఇంకా ఉందా మామ గారూ?" అని ప్రశ్నించింది.

"బహుశా లేకపోవచ్చు. లేకపోయినా వారికి చేరిన ఫిర్యాదుల్ని బట్టి, మరెవరైనా అయినట్లయితే ముందు తెలియ చెయ్యకుండానే పోలీసుల్ని పంపి పట్టించేవాళ్లు. కాని ఇది అయఃపిండం అని తెలుసు కనుక, పోలీసుల్ని పంపి రెచ్చగొట్టటానికి సాహసించలేదు. అసలు అధికారులే వేట అనే మిషతో దర్యాప్తు చెయ్యటానికి వస్తున్నారు. కాదనటానికి వీల్లేదు. కొత్త ఆర్డినెన్సులూ—"

చండి విస్మయాకంఠంతో - "ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయమే మామగారూ! సర్కారువారు మిమ్మల్నికూడా 'ఆర్డినెన్స్' అనే త్రాళ్లతో బంధింప చూస్తున్నారా?—" అని అడిగింది.

అంతవరకు అడగగానే మామగారి ముఖంలో హఠాత్తుగా భావపరివర్తనం కలగటం గమనించి, బలవంతాన గొంతు నొక్కుకుంది.

హరినారాయణబాబుకి కొంచెం వేడి పుట్టింది "నన్నా? ఇగుగో అమ్మాయీ! ఈసారి పొరపాటు చేశావంటే—"

చండి అవిచలితకంఠంతో - "నా ఊహ సరియైనది కాదని మీ ముఖం చూడగానే తెలుసుకున్నాను వారు 'వేట' అనే మిషంతో మరెవర్నో వేటాడాలని వస్తున్నారని ఇప్పుడు అర్థం చేసుకున్నాను" అన్నది.

"గ్రహించావా అమ్మా? గ్రహించావా? అయితే వాళ్లు వస్తున్నారంటే నేనెందుకింత కళవళపడుతున్నానో ఇప్పుడు తప్పకుండా గ్రహించి ఉంటావు"

చండి ఒక్కక్షణం ఏదో ఆలోచించుకుంది. తర్వాత స్నిగ్ధకంఠంతో - "నేను తమ పాదాలు స్పృశించి చెప్పగలను మామగారూ! ఒకటి రెండు కఠినకృత్యాల్లో జోక్యం కలిగించుకున్నా' 'ఆర్డినెన్స్' బంధనాల్లోకి పోయి చిక్కుకునేటంత అన్యాయకృత్యాల్ని నేనింతవరకు యెన్నడూ చెయ్యలేదు. వాళ్లు తప్పకుండా ఏదో కల్పితగాథలు విని మనల్ని ఆఘాతపరచాలనే సంకల్పంతో నే వస్తున్నారని తోస్తుంది. కాని అకల్పితకథలకి 'అస్తిత్వం' అనేది లేదు" అన్నది.

హరినారాయణబాబు చండిమాటల్ని నిబ్బరంతో విన్నప్పటికీ - చివరికి కంగారుపడుతూ - "నేనిప్పుడు ఆరోగ్యంగానే గనుక ఉన్నట్లయితే అసలే బెడదవచ్చినా ఆలోచించాల్సినపనే లేదు కాని ఇప్పుడింక మళ్ళీ లేచి నిలబడగలనో లేనో ఏం తెలుసు - ఈ పెద్దపులిఒంట్లో పద్దెనిమిది గుళ్లు దూరాయి - ".

చండి ఆయనమాటలకు అడ్డువచ్చి - "నామీదవచ్చినఫిర్యాదేమిటో మీకసలు తెలుసా మామగారూ?" అని అడిగింది.

హరినారాయణబాబు అస్థిరభావంతోనే. "చాలా...చాలా ఉన్నాయమ్మా! చాలా ఉన్నాయి. ఇవి ఇదివరకయినట్లయితే బయటికి వచ్చేవే కావు కాని ఏం చెప్పగలం అమ్మా! ప్రతిరికార్డులోనుంచి ఏదో ఒకటి బయటపడుతూనే ఉందిట: సర్కారువారి రికార్డులను కాదనటానికి వీల్లేదు. ఫిర్యాదులన్నీ నీమీదే వచ్చాయి నువ్వు చాలా సందిగ్ధావస్థలో పడేశావ్. నువ్వు రాసిన ఉత్తరాలుకూడా చాలా పట్టుపడ్డాయట: నువ్వు ఇదివరలో చేసిన కఠినకార్యాలన్నీ ఇప్పుడు దృష్టాంతాలుగామారిపోయాయట! అదీకాక నువ్వు నన్ను నీ గుప్పెటలో పెట్టుకున్నావుట: ఆ వెర్రిబాగులవాడ్ని నిర్లక్ష్యం చేసి, నువ్వే 'బాసలీ' యెస్టేట్ అధికారాన్ని చేజిక్కించుకోవాలనే ప్రయత్నంలో ఉన్నావట. ప్రభుత్వ వ్యతిరేకులకు సాహాయ్యం చెయ్యటమే నీ ప్రధానోద్దేశ్యంట!...అని చెప్పాడు.

మామగారి మాటల్ని చండి చాలా శ్రద్ధగానే విన్నది. కాని ఆమె ముఖంలో భయమూ - దిగులూ అలాంటి లక్షణా లేవీ కన్పించలేదు."

"న్యాయమైనదాన్ని బలవంతంగా అన్యాయంకింద జమకట్టటానికి అనేకులు అనేక ప్రయత్నాలు చేస్తూఉంటారు - కాని న్యాయం ఎప్పుడూ న్యాయంగానే ఉంటుంది సత్యమెప్పటికీ మిథ్య కాబోదు. ఏం చెయ్యను! నేను మీయింటి కోడల్ని. లేకపోతే నేను స్వయంగానే వారి యెదుటకు వెళ్లి సంజాయిషీ ఇచ్చేదాన్ని"—అన్నది.

మామగారు అమితోత్సాహంతో "ఇందుకే నిన్ను రమ్మని కబురంపించాను, ఇందుకే - ఈ సంజాయిషీ ఇప్పించాలనే!" అన్నాడు.

చండి వక్రదృష్టితో మామగారి ముఖం కేసి చూస్తూ "మామగారూ! అయితే నేను—"

హరినారాయణబాబు కొంచెం గట్టిగానే - "ఆఁ! నువ్వు సిద్ధంగా ఉండమ్మా! నేను చెప్పినప్పుడు నువ్వు ఇంక సంకోచించవలసిన పనిలేదు. ఇప్పుడు భారమంతా నీమీద వేసుకుని ఉన్నాను. నువ్వు

# ★ స్వయంసిద్ధ ★

వెళ్ళిరా అమ్మాయీ!—" అన్నాడు.

"వారు వచ్చాక - అవసరమని తోస్తే నేను వెడతాను మామగారూ! ప్రస్తుతం నా కర్తవ్యం అంతా మీకు ఉపచారాలు."

"కాదు తల్లీ కాదు. అన్నిటికన్నా ఇప్పుడు నీ కర్తవ్యం ఆత్మరక్షణకు అవసరమైన ఏర్పాట్లు చేసుకోవటమే. నీ మర్యాద కాపాడుకోవటం యెలాగో నీ గదిలో కెళ్లి కూర్చుని బాగా ఆలోచించుకో. ఇప్పుడు నా విచారమంతా నిన్ను—"

చండి అవిచలిత కంఠంతో - "నేను మీ పాదాలు పట్టుకుని మనవిచేస్తున్నాను మామగారూ. మీరీ విషయంలో నిశ్చింతగా ఉండండి. మనస్సులో కల్మషం అనేది లేనివారిని - వారి మర్యాదనూ జగదంబే రక్షిస్తుంది. ఆ తల్లి కృపవల్ల వంశానికి అగౌరవం రానేరదు" అన్నది.

హరినారాయణబాబు మనస్సులో చాలా తృప్తిపడి, ఆవేశంతో - "ఈరక్షణ కేవలం నీకే కాదు, నాకు కూడాను. అసలదికాక నేనే జబ్బునయమై మళ్ళీ గట్టెక్కితే-అప్పుడా శాసనాన్ని - ఎందుకులేఅమ్మా! ఇప్పుడా అనవసరప్రసక్తిఅంతా...ఏదో చెప్పబోయి ఏదో చెప్పాను. అయితే ఇహ నువ్వు వెళ్ళిరాఅమ్మా! తెల్లవారటానికి ఇంకెంతో వ్యవధి లేదు" అన్నాడు.

చండి మామగారిపాదాలను మెల్లిగా దిండుమీదఉంచి, సవినయంగా - "నేనింక వెళ్లివస్తాను. నాది ఒక్క మనవి. తమరింక మాట్లాడవద్దు" అన్నది.

హరినారాయణబాబుకి నవ్వొచ్చింది. "అలాగేలేఅమ్మా! ఇంక మాట్లాడను. నువ్వు వెళ్ళిరా"

చండి మెల్లిగా రోగిగదిలోంచి బయటికి వచ్చేసింది. కొంచెంసేపయాక హరినారాయణబాబు గట్టిగా నిట్టూర్చి, "కేవలం సంజ్ఞతోనే అసలుసంగతి అర్థం చేసుకుంది. అంచేత నేను చెపుదాం చెపుదాం అనుకుంటున్నది చెప్పటానికే వీల్లేకపోయింది" అన్నాడు.

మామగారు - కోడలూ మాట్లాడుకుంటూంటే రాణీ యింతసేపూ మెదలకుండానే ఊరుకుంది. ఇప్పుడిహ కొంచెం వెటకారంగా "అయితే ఇంతసేపూ మీరు చూపించిన ఉద్వేగం అంతా ఒట్టిదేనన్న మాటా?" అని అడిగింది.

ఆమాటవినగానే అతడు మండి పడ్డాడు.

"ఒట్టిదేనా అని అడగటంలో ఏమిటి నీ ఉద్దేశం? నేనసలుసంగతి చెప్పనేలేదనా?"

రాణికూడా ఏమాత్రం తెల్లమొహం వెయ్యకుండా "'అసలు సంగతి' ప్రసక్తి అంటూవస్తే 'ఒట్టి సంగతి' అనేదికూడా దానంతటదే వస్తుంది. నేనేం తప్పు మాటాడలేదు మాటదాచే అలవాటు లేదు నాకు" అన్నది.

జమీందారు రాణికేసి తీవ్రంగా చూసి, తర్వాత కొంచెం గంభీరంగా, "ఈ అలవాటును నేర్చుకోవటం ఇదే మొదలు కనుక నే నాకైనా, ఈ అవస్థ వచ్చిపడింది" అన్నాడు

రాణీ సందిగ్ధదృష్టితో భర్త ముఖంకేసి చూస్తూ "అలా అనటంలో అర్థం? ఎవర్ని ఉద్దేశించి ఇప్పుడీ అసలు విషయప్రసక్తి తీసుకువచ్చింది?" అని అడిగింది.

భర్త ఈసారి కఠినంగా – "వినాలని ఉందా? అసలు సంగతేమిటో తెలుసా? ప్రబుద్ధుడైన నీ కొడుకు వినుడాక్టర్ని లీగల్ ఎడ్వైజర్ గాగా వెంటపెట్టుకుని కలెక్టరు దగ్గిరకి వెళ్ళి నామీద—"

"ఎవరు? నివారణుడా?"

"ఆఁ. ఆఁ! కాకపోతే 'ప్రబుద్ధు' డని యెందుకంటాను?"

"ఏం చెప్పాడు?"

"చాలా చెప్పాడు. చాటుచాటుగా తన అస్త్రాలన్నిటినీ గుప్పించాడు"

"ఎవరు చెప్పారా సంగతి?"

"ఆ సంగతి అనవసరం. గాలే వచ్చి అన్ని సంగతులూ నా చెవులో ఊది పోతుందన్న సంగతి జ్ఞాపకం ఉంచుకో. కాని అబద్ధాలు మాత్రం కావు, అన్నీ యథార్థవిషయాలే అంచుకనే కలెక్టరుగారు కమీషనర్ గారితో సహా వేట అనే నెపంతో బాసలీకి వేంచేస్తున్నారు. ఈ అసలు సంగతి బాపూలీకి తప్ప ఇంకెవరికీ తెలియదు. నేనూ మనస్సులో పెట్టుకుని నోరుమూసుకుని ఊరుకున్నాను. కాని ఉండబట్టలేకపోయాను మనస్సును సరియైన స్థితిలో పెట్టుకోలేకపోయాను. అయినా విచారకరమైన - ఉస్! ఉస్! అబ్బ!..."

ఉద్రేకం ఎక్కువవటంతో అంతవరకు చెప్పేసరికి అతడి గొంతు పట్టుకుపోయింది. ఆ ముఖభంగిమ, ఆ అస్వాభావిక దృష్టి గదిలో ఉన్నవారినందరినీ చకితుల్ని చేసింది. డాక్టరు ఆదరా బాదరా మళ్ళీ రోగిదగ్గిరకి పరుగెత్తుకొచ్చాడు.

## 23

బాసలీ నివాసుల్ని చకితుల్ని చేస్తూ, కలెక్టర్, కమీషనర్ ప్రభృతులు, ఉషఃకాలానికే జమీందారుగారి భవనానికి చేరుకున్నారు. వారివెంట పోలీసు సూపరింటెండెంట్, కొందరు పోలీసు ఇన్స్పెక్టర్లూ, మరికొందరు కానిస్టేబిల్సూ ఉన్నారు.

దివాన్ రాధానాథబాపూలీ ఎస్టేట్లోని ప్రముఖ ఉద్యోగులందరితో కలసి ఈ దొరలకు స్వాగతం చెప్పటానికి సిద్ధంగానే ఉన్నాడు. ఈ అభ్యాగతులను చక్కగా అలంకరించిన 'డ్రాయింగ్ రూం'లోకి సగౌరవంగా తీసుకెళ్ళాక, జమీందారుగారికి హఠాత్తుగా జబ్బుచేసిన సంగతి చెప్పి, దివాన్జీ ఇంకా ఇలా అన్నాడు. "నేను వారి ప్రతినిధిగా తమకు కావలసిన ఏర్పాట్లన్నీ చేయటానికి నియుక్తుడనయినాను వేట విషయములో తమ తమ అభిరుచులకు అనుగుణంగా ఏర్పాట్లూ అవీ చెయ్యటంలో ఏమాత్రం అశ్రద్ధ జరగదు"

కలెక్టరు సందిగ్ధహృదయంతో కమిషనర్ కేసి చూశాడు. ఒక్క క్షణం ఉభయులూ ఏదో గుసగుసలాడుకున్నారు మరుక్షణంలో కలెక్టరు కుర్చీలోంచి లేచి, దివాన్ను రహస్యంగా పిలిచి, మెల్లిగా ఇతరుల కెవ్వరికీ విన్పించకుండా అసలు సంగతి బయటపెట్టాడు—తాము వేటకనే ఇక్కడికి వచ్చారుట, కాని నిజానికి తమ ఉద్దేశం అది కాదుట! జమీందారుగారి కోడలిమీద వచ్చిన ఫిర్యాదుల్ని—ఈ నెపంతో దర్యాప్తు చెయ్యటానికి వచ్చారుట. అయినా కమీషనర్ గారి ఉద్దేశం మాత్రం ఇంత పెద్ద జమీందారుకుటుంబ గౌరవాన్ని కాపాడేందుకుగాను ప్రాథమిక విచారణంతా రహస్యంగానే జరపాలనిట!

"తమరు తలవని తలంపుగా చెప్పిన ఈ విషయం మాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. తమరు ఎవరి విషయమై దర్యాప్తు చెయ్యటానికి వచ్చారో, ఆమె చక్కని స్వభావాన్ని, నిర్దోషిత్వాన్ని తెలుసుకుని చివరకు పశ్చాత్తాపపడవలసి ఉంటుంది" అన్నాడు దివాన్.

"ఈశ్వరానుగ్రహంవల్ల ఆమె నిరపరాధిని అని రుజువయితే మేమూ చాలా సంతోషిస్తాం. అయినా దర్యాప్తుమాత్రం జరప



వుండా ఉండటానికి వీల్లేదు" అన్నాడు కలెక్టరు.

"అలాంటి అభిప్రాయం ఉన్నట్లయితే, స్టేట్ రూంలోనే విచారణ కొనసాగించవచ్చు" అన్నాడు దివాన్.

మళ్ళీ దొరలిద్దరూ ఏదో కాసేపు సంప్రదించుకున్నారు. "అలాగే. ఆ ఏర్పాటు బాగానే ఉంది. కాని ఆ గదికి చుట్టుప్రక్కల ఎవరూ ఉండకూడదు. కమిషనరు, నేనూ, కమీషనర్ పర్సనెల్ అసిస్టెంటూ, సూపరెండెంటూ, ఇంకా కొద్దిమందిమాత్రమే ఉంటాం. దివాన్‌జీ, మరొక వకీలు ప్రతివాదికి సహాయంగా ఉండవచ్చు" అని అన్నాడు కలెక్టరు.

"వకీలు ఉండవలసినఅవసరం ఏమీ లేదు.

తనమీదవచ్చిన ఫిర్యాదులన్నీ నిరాధారాలే అయితే ప్రతివాదిని వాటినన్నిటినీ స్వయంగానే ఖండించగలదు. ఒకవేళ యథార్థాలే అయినట్లయితే 'జాక్సన్' దొర వచ్చి నిలబడ్డా ఏంఫర్వాలేదు" అన్నాడు దివాన్.

దివాన్ చెప్పినదానికి కమీషనర్ తృప్తిపడి, "సరే, బాగుంది. ఆ ఏర్పాట్లన్నీ మీరే చెయ్యండి" అన్నాడు.

ఏర్పాట్లు చెయ్యటంలో విలంబమేమీ జరగలేదు. జమీందారీ ఆఫీసులన్నీ చుట్టూ ఉండేమధ్యహాల్లో ఈ నలుగురుఅధికారులూ సమావేశమయినారు. ఆ పెద్దహాల్లో బ్రహ్మాండంగా చేసిన ఈ రాజకీయపు ఏర్పాటు అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

"జమీందారుగారికొడుకులెక్కడున్నారు? ఇష్టమయితే వారుకూడా ఇక్కడికి రావొచ్చు" అన్నాడు కమీషనర్ ముందుగానే.

"చిన్నకొడుకు ఊళ్లోలేరు. నిన్నరాత్రే అతడికోసం కబురు వెళ్ళింది. పెద్దకొడుకు ఇంట్లోనే ఉన్నారు. అతడికి ఒంట్లో కులాసాగాలేదు. అయినా ఈ విచారణకు రావటంఅవసరమయితే వస్తాడు." అన్నాడు దివాన్.

పెద్దకొడుకుకు ఒంట్లో బాగాలేదన్న మాట కలెక్టరుకు కొంత ధైర్యాన్ని చిక్కించింది. ఈలోపుగానే - ఈ ఫిర్యాదులన్నీ ఎవరిమీదఉన్నాయో, ఆమె రాకకోసం ఇక్కడి అధికారులు ఎదురుచూస్తున్నారన్నవార్త అంతఃపురంలోకి పంపబడింది.

కాని ఎక్కువసేపు వారు ఎదురుచూడవలసిన పనిలేకుండా పోయింది. లోపలివైపుకి ఉన్న గుమ్మంలోనుంచి, పరదా తొలగించుకుని ఆమె వారి ఎదుటికివచ్చి నిలబడింది. అనవద్యమైన ఆమె ఆకృతిని, అనింద్యసుందరమైన ఆమె ముఖంలోని అపూర్వతేజస్సును, సంకోచం అంటూలేని ఆమె నిర్భయ-వైఖరిని చూసి ఈ అధికారులు - తాము ఆమెమీద ఆరోపింపబడిన ఫిర్యాదుల్ని విచారించటానికి వచ్చామన్న సంగతి మరిచిపోయారు. కమీషనర్ని చూడగానే అతడితోపాటు అందరూ లేచి నిలబడ్డారు. టోపీలు తీసి నతశిరస్కులుకూడా అయినారు.

ఎవరినూలకంగా ఈ అధికారుల కిక్కడింత గౌరవమర్యాదలు చూపబడుతున్నాయో, ఆమెకూడా ప్రత్యభివాదసూచకంగా కొంచెం శిరస్సువంచి, స్వచ్ఛమైన ఇంగ్లీషులో "ఒక సామాన్య స్త్రీని అరెస్టు చెయ్యటానికనివచ్చి మీరు చూపుతున్న గౌరవనీయమైన ప్రవర్తన మీ జాతియొక్క సభ్యతకు నిదర్శనం. ఇందుకు నేనుకూడా సవినయంగా ధన్యవాదాలు తెలుపుతున్నాను" అన్నది.

అందరూ చకితులయినారు. కమీషనరుతోనూ, కలెక్టరుతోనూ స్వచ్ఛమైన యింగ్లీషులో మాట్లాడకలిగిన జమీందారులు కొద్దిమంది మాత్రమే ఉన్నట్లు వారికి తెలుసు. పల్లెటిదిక్కువాడయిన ఈ జమీందారు ఏయే విషయాల్లో అజ్ఞానుడో అదీ తెలుసు వారికి. కాని ఆయన కోడలే ఇంత చక్కని ఇంగ్లీషు ఇంత స్వచ్ఛంగా మాట్లాడ్డంచూసి, వారు ఒక్కక్షణం స్తబ్ధులయినారు.

చండి వారి స్తబ్ధతకు భంగంకలిగిస్తూ "మా దురదృష్టంకొద్దీ, మాననీయులైన మా మామగారు తమవంటి ఉన్నతాధికారులతో సంప్రదింపులు జరపటానికి అవకాశంలేకుండా అస్వస్థులయినారు. నేను వారికోడల్ని అయినప్పటికీ మీతో సమానస్థాయాగా సంప్రదింపులు జరిపే అధికారం లేదు నాకు. ఎంచేతంటే నామీద వచ్చిన ఫిర్యాదుల్ని గురించి దర్యాప్తు చెయ్యటానికి తమరు వచ్చారు కనుక... తమకు ఈ విచారణలో చేతనయినంతవరకు తోడ్పడటానికే వచ్చాను నేను.

తమరు దయఉంచి సావకాశంగా కూచోండి మీ రడిగే ప్రశ్నలన్నిటికీ జవాబులు చెపుతాను" అన్నది.

"ముందు మీరు మీ 'సీట్'లో కూచోండి. మా కర్తవ్యాన్ని కాదనలేక మేము ఈ అప్రీతికరమైన వ్యవహారంలో విచారణ జరపటానికని వచ్చినా, మీమీద ఉన్న ఆరోపణలన్నీ రుజువు కానంతవరకు- మీ స్వాతంత్ర్యానికి, మీ మర్యాదకి భంగం రానీయము. దయఉంచి కూచోండి మీరు" అన్నాడు కమీషనరు.

తప్పనిసరియై దగ్గరలోనే ఉన్న ఒక సోఫాలో కూర్చున్నది చండి. ఆమె కూర్చున్నాక కమీషనరు, తదితర ఉద్యోగులూ తమ తమ స్థానాల్లో కూర్చున్నారు.

తర్వాత విచారణ ప్రారంభమైంది. కమీషనరుగారి శెక్రటరీ ఆ ఫిర్యాదులకి సంబంధించిన 'ఫైల్స్' తీసి కమీషనరు ముందు పెట్టాడు.

ఆ కాగితాలన్నీ వరుసక్రమంలో ఫైల్ చెయ్యబడ్డాయి. మొదటి పేజీమీద చూపు పడగానే "తమపేరు శ్రీమతి చండీదేవీయా?" అని అడిగాడు కమీషనరు.

"అవును" అన్నది వెంటనే చండి.

"మీ వివాహమై ఎన్నాళ్లయింది?"

"ఇవాల్టికి సరిగ్గా ఆరునెలల ఇరవైరోజులయింది.

"మీ పుట్టిల్లు శ్యామాపురమా? వివాహానికి ముందు అక్కడే ఉండేవారా మీరు?"

"అవును."

"అక్కడ ఉండగా మీరు ఓ మిషన్ గరల్స్‌స్కూలు లేడీ టీచరు మిస్ క్రిస్టుకుమారిని కొట్టి అవమానపరిచారుట కదూ?"

"కొట్టటంమాత్రం చెయ్యలేదు. కాని అవసరమయినంతవరకు అవమానించినమాట మాత్రం వాస్తవం."

"దాన్ని మీరు అపరాధంగా భావించటంలేదా?"

"ఈ సంఘటన జరిగి చాలా కాలమయింది. ఇన్నాళ్ళ కిప్పుడు ఆ అప్రీతికరమైన సంఘటనను పురస్కరించుకొని నామీద ఫిర్యాదు చెయ్యబడిందా?"

"ప్రత్యేకమైన ఫిర్యాదంటూ యేమీ రాలేదు. కాని అసలు ఫిర్యాదుకు ఇదొక నిదర్శనంగామాత్రం ఉంది. మీరు సమాధానం చెప్పండి"

"నా సమాధానాన్ని మీరు యథార్థమైనదిగా విశ్వసిస్తారా'?

"తప్పకుండా...మీలాంటి సుశిక్షితరాలైన యువతి అబద్ధమాడదని మా గట్టినమ్మకం"

"అయితే ఆ గాథను సంక్షేపంగా చెప్పాలి నేను"

"చెప్పండి"

"నాకు జ్ఞాపకం ఉన్నంతవరకు - ఆస్కూల్లో ఏదో ఉత్సవానికి ఊళ్ళో ఇతర స్త్రీలతోపాటు నాకుకూడా ఆహ్వానంవస్తే వెళ్ళాను. కాని స్కూల్లో లేడీ టీచర్ మమ్మల్ని నిష్కారణంగా అవమానించింది"

"ఏంచేసింది?"

"ఆమె తన ఉపన్యాసంలో మా ధర్మాలమీద, మా సమాజంమీద, మా సంస్కారాలమీద విరుచుకుపడింది. అంతమందిలోనూ నేనొక్కదాన్నే ఆ ఉపన్యాసాన్ని ఖండించవలసి వచ్చింది"

"అలాగా! ఊఁ. తర్వాత?"

"నేను ఖండించినదానికి ఆమె సహేతుకమైనసమాధానం యేమీ ఇవ్వకుండా, నన్ను తనయెదుటికి పిలిచి చెంపమీద కొట్టింది."

"అప్పుడు మీరేంచేశారు?"

"విసుక్కున్న అక్రోశానుసారం ఈ చెంప

మీదకొడితే రెండో చెంప చూపలేదు. ఆమెని మర్యాదగా మందలించాలనే ఉద్దేశంతో చేత్తో ఆమెముందున్న టేబిల్‌ను పక్కకి ఎత్తేశాను. దాంతో ఆమె క్రింద పడింది. ఆ టేబిల్ మీది సిరాబుడ్డిలోని సిరా ఒలకటంవల్ల ఆమె నల్లనిముఖం మరింత నల్లబడిపోయింది"

అదివిని కమీషనరు, అతడిసహచరులూ అతికష్టంమీద నవ్వును ఆపుకున్నారు. చండి సంకోచించకుండా మళ్ళీ "నేనిలా చెయ్యటం అపరాధంగా కనుక మీరు భావిస్తే నేను తప్పక అపరాధినే" అన్నది.

ఈప్రశ్నని ముగించి కమీషనరు మరొక ప్రశ్న వేశాడు. "ఈమాటనిజమేనా? మీరే పట్టుపట్టి బలవంతాన ఆ మిషన్‌స్కూల్‌ను ఎత్తివేయించారుటగా!"

"ఒక్క వాటికే కాదు. ఆనుషంగికంగా దీనికి నేనే కారణం కావచ్చు. కాని నేను, మాత్రం వారి స్కూల్‌కు విరుద్ధంగా ఒక్క మాట కూడా అని ఎరుగను"

"వివాహానికి ముందు ఈ ఉద్దేశంతో నేగా—ఆ స్కూల్ ఎత్తివేయించి మీ పేరుతో కొత్త స్కూల్‌ను స్థాపించమని మీ మామగారిని కోరింది?"

"నేను మామగారిని బాలికలకు ఒక ఉచిత విద్యాలయాన్ని స్థాపించమని కోరిన మాట వాస్తవమే; కాని ఏ స్కూలునూ ఎత్తివేయించమని వారిని కోరనూ లేదు. వారు ఎత్తివేయించనూ లేదు. కాని నేనిలా కోరినందువల్ల వారు స్కూల్‌ను స్థాపించిన కారణంగా - ఏ స్కూలు తలుపులయినా మూతబడితే అది వేరే సంగతి."

"కాని ఈ కోరిక సమర్థనీయమేనా?"

"అయితే మీరే చెప్పండి. మా ధర్మానికి సంస్కారాలకి సంబంధించిన చక్కటి శిక్షణ యిచ్చే విద్యాలయం లేకపోయిన చోట-అలాంటి విద్యాలయాన్ని స్థాపించమని నేను కోరితే అది నేరం అవుతుందా?"

కమీషనరు స్తబ్ధులాగా కొంచెంసేపు కాగితాలకేసి అలాగే చూస్తూ ఊరుకున్నాడు.

"మీకోరికలో ప్రచ్ఛన్నంగా ఎలాంటి విద్వేషభావమూ కనుక లేకపోతే మాత్రం అలా కోరటం నేరం కానేరదు సరికదా ప్రశంసించతగిన విషయం. కాని అసలు మీకు అలాంటి శిక్షణ - ప్రచారాలను గురించి విప్లవాత్మకమైన అభిప్రాయాలున్నట్లు మాకు చాలా దృష్టాంతపూర్వకంగా తెలిసింది" అన్నాడు.

చండి తన కంఠస్వరాన్ని కొంచెం తీక్ష్ణంగా మార్చి, "ఎలాంటి ప్రమాణాల మీద ఆధారపడి మీరు నన్ను గురించి ఇలా అభిప్రాయపడ్డారో తెలుసుకోవచ్చునా నేను?" అని అడిగింది.

కమీషనరు చేతులో ఉన్న ఫైల్‌ను ఎత్తిపట్టుకుని, "తప్పకుండా. ఈ ఫైల్ చూడండి మీరు. ఇందులో ఆ ఉత్తరాలూ ఆ సంతకాలూ అన్నీ ఉన్నాయి. అవన్నీ సరిగ్గా చదివి, తర్వాత వాటిమీద మీ సంజాయిషీ యివ్వండి" అన్నాడు.

ఆ ఫైల్‌లో కొన్ని ఉత్తరాలూ, కొన్ని అచ్చయిన నోటీసుల్లో ఆమె పేరూ ఉన్నాయి. చండి ఆ ఫైల్ చూసి, అక్కడక్కడ కొద్దికొద్దిగా చదివి, దాన్ని అక్కడేఉన్న ఐవరీటిపాయ్‌మీద పెట్టి, "ఇందులో మీరు సంపాయించిపెట్టిన— అస్త్రాలమీదనే ఆధారపడి, నామీద యుద్ధానికి దిగినట్లయితే మీ శ్రమఅంతా వ్యర్థమే అనాలి" అన్నది.

ఆమె అంత పట్టుదలగా మాట్లాడే తీరుకి కమీషనరు రవంత స్తబ్ధుడై "ఎందుకని?" అని అడిగాడు.

"అవన్నీ చెల్లనివే" అన్నది చండి.

కమీషనరు ముఖంలో చిరాకు స్పష్టంగా వ్యక్తమవుతోంది. చండి తీక్ష్ణదృష్టితో అది గమనించి, "వీటి విషయంలో నా సంజాయిషీనికూడా దయ ఉంచి వినండి" అన్నది.

అలా అంటూనే ఆమె ఫైల్‌లోనుంచి, తన పేరు అచ్చుఅయిఉన్న ఒక కాగితం తీసి, "క్రింద నా పేరుతో ఈ ప్రకటన కాయితం వెలువడింది - 'శ్యామాపురంలోని మిషన్‌స్కూల్ ఎత్తివేయించటం అనేది చాలా కష్టం. ఇలాంటి ప్రత్యేక సందర్భాలలో చివరిమార్గం అవలంబించాలి. ఒకటి రెండు మిషన్ స్కూళ్లలో అలజడిపుట్టిస్తే, మిషనరీ టీచర్లమీద దురాక్రమణచేస్తే, ఈ దేశంలో వారి స్కూళ్ళు ఎన్ని ఉన్నాయో అన్నీ మూయబడతాయి.' ఈ కాయితంమీద నా పేరు మాత్రమే ఉండి, ప్రెస్ పేరు లేకపోవటం మీరు తప్పక గమనించిఉంటారు. నాకేమీ పేరు ప్రఖ్యాతులు లేవని, నేను అంతఃపురం విడిచి బయటికి రావటానికి వీల్లేనిదాన్నని మీరంగీకరించి తీరాలి. నాకిలాంటి ఉద్దేశమే ఉన్నట్లయితే, ఆ ఉద్దేశ్యసిద్ధికి ఈ కాయితం అచ్చువేయటం దేనికి? మా మామగారి ప్రతాపంతో, పలుకుబడితో, వారి ఎస్టేట్‌లో ఉన్న స్కూళ్లనన్నిటినీ చట్టసమ్మతమైన పద్ధతులలోనే మూయించవచ్చు. ఈ శ్యామాపురం సంఘటనని ఇంకెక్కడా ఆధారంగా తీసుకోలేదు కదా" అన్నది.

కమీషనరు ఆమెమాటలన్నీ శ్రద్ధగా విన్నాడు. "అయితే దీంతో మీకు సంబంధం ఉన్నట్లు ఒప్పుకోరా?" అని అడిగాడు.

"ఏమాత్రం ఒప్పుకోను" అన్నది చండి కఠినంగా.

"మరి ఈ ఉత్తరాలన్నిటిమాటో? వాటితోనూ మీకేమీ సంబంధం లేదంటారా?"

"అవన్నీ చెల్లేవికావని మీకు ముందుగానే చెప్పానుసార్! ఉత్తరాలను పరీక్షగా చూస్తే-లోపల ఉన్న విషయమంతా ఒక స్త్రీ రాసినట్లు, ఆమెకూడా ఏదో అంతంతమాత్రంగా చదువుకున్న స్త్రీయేనని మీకే తెలుస్తుంది. అందులో ప్రతి పంక్తిలోనూ తప్పులు కన్పిస్తానే ఉంటాయి. పైన చిరునామామాత్రం బాగా చదువుకున్న పురుషుడెవడో రాసి ఉంటాడు ఇంగ్లీషులో. నా ఇంగ్లీషు దస్తూరీ, బెంగాలీ దస్తూరీకూడా మీకు వ్రాసి చూపిస్తాను. మీరు పరీక్షించి చూడండి ముందు. తర్వాత దస్తూరీలను పోల్చటంలో నిపుణులైనవారిదగ్గరకు పరీక్షకు పంపిచూడండి. అప్పుడైనా తెలుసుకుంటారు నేను చెప్పింది అబద్ధం కాదని."

దగ్గరలోనే టేబిల్‌మీద ఉన్న కాయితం కలం తీసుకుని, కొన్ని పంక్తులు ఇంగ్లీషులోనూ, కొన్ని పంక్తులు బెంగాలీలోనూ వ్రాసి, చండి ఆ కాగితాన్ని కమీషనరు టేబిల్‌మీద పెట్టింది.

వెంటనే ఆమె దస్తూరితో ఉన్న ఉత్తరాల ఫైలును తీసుకుని కమీషనరు, అతడి అనుచరులు ఆ దస్తూరీల వ్యత్యాసాన్ని తెలుసుకునే ప్రయత్నంలో పడ్డారు. ★

(సశేషం)








# ప్రతి రోజూ

చావలి రామచంద్రరావు

సూరీడుతో మేము పందెమేస్తాము
తెల్లవారక ముందె నిదుర లేస్తాము.

తేటముత్తెపుసరులనే మించిపోవంగ
తెల్లగా మాపళ్ళు తోముకుంటాము.

చలియనక గిలియనక చక్కగా మేము
చన్నీళ్ళతో స్నానమాచరిస్తాము.

మల్లెపూవుల తెల్లదనము మరపించు
చలువబట్టలు మేము ధరియించుతాము.

చద్దియన్నము కొద్దిగా యారగించి
బద్ధకించక మేము బడికి పోతాము.

సద్దుచేయక బడిలో ముద్దుగా మెలగి
శ్రద్ధగా పాఠాలు నేర్చుకుంటాము.

తోటిబాలురగూడి బడివిడువగానె
తోటలందున ఆట లాడుకుంటాము.

అమ్మనూ, నాన్ననూ యిబ్బంది పెట్టకనే
ప్రొద్దు గూకకముందె యిండ్లకేగదము.

వేడినీటితో స్నానమాచరించెదము
హాయిగా మంచి వస్త్రాలు గట్టెదము.

అమ్మ పెట్టినబువ్వ అరగిస్తాము
ముద్దుచెల్లితో కొంత ముచ్చటాడెదము.

ఏరోజు పాఠాలు ఆరోజె చదివి
పెద్దలని మించెదము విద్యల్లో మేము.

నిద్దురొచ్చిందాక శ్రద్ధగా చదివి
ప్రొద్దు పోవకముందె నిద్రపోతాము.

బాలసూర్యునితోడ పందెమ్ము వేసి
మేలుకొందుము తిరిగి ప్రొద్దుపొడవకనె.

తెలుగు తేజము వెలుగు జీవితముగడపి
తెలుగు బాలలగొప్ప తెలియ జెప్పెదము

పెద్ద కథ:

# ★ వాసు చదువు ★

## 1

సూర్యనారాయణ ఓ చిన్న పల్లెటూరిలో సామాన్యపు వ్యవసాయదారుడు. అక్కడున్న వ్యవసాయదారులందరిలో కొద్దిపాటి చదువు గలవాడితనొక్కడే. అందుకే అతనంటే చాలమందికి అభిమానం, గౌరవమూను. విద్యావిహీనులందరూ అతని దగ్గరికి వచ్చి వుత్తరాలు రాయించుకోవటం గాని, సలహా లందుకోవటం గాని కద్దు; దానికి ప్రతిఫలంగా తృణమో పణమో, ముట్టుతుండేది.

సూర్యనారాయణకి లేక లేక ఓ కొడుకు పుట్టాడు. వాసుదేవరావని నామకరణం చేశారు పెద్దలు. కాని అందరూ 'వాసు' అనే వ్యవహరిస్తుండే వారు. సూర్యనారాయణ భార్య వెంకటలక్ష్మి, ఆ బిడ్డను వరప్రసాదంగా చూసుకునేది. పుట్టాడు కూడా అందంగా, ముద్దుగా వుండేవాడు. పుట్టినప్పుడే అన్నారు నక్షత్రబలం బాగా వుందని.

సూర్యనారాయణ కొడుకుపై కొండంత ఆశ పెట్టుకున్నాడు. తన చిన్నపాటి ధనంతో వీలయినంత వరకు చదివించి ఓ వుద్యోగస్తునిగా చేయించాలని అతని అభిలాష. కాని మానవుడనుకున్నవన్నీ తప్పక జరుగుతాయన్న నిర్ధారణేమిటి? అదీ కాక సూర్యనారాయణ యేమంత చెప్పుకోతగ్గ భూఖామందు కాడు. పండించిన పంట తిండికి యితర ఖర్చులకీ మాత్రం సరిపోతుంది. అయినప్పటికీ అతని నిశ్చయం బలంగానే వుంది.

రోజులు, నెలలు, సంవత్సరాలు గడిచాయి. వాసుకి అయిదో సంవత్సరం ప్రవేశించింది. సూర్యనారాయణ కొడుక్కి అక్షరాభ్యాసం చేయించాడు. అప్పటి ఆకుర్రాడి చురుకుదనం చూచి


ముద్దంశెట్టి హనుమంతరావు
(లలితశ్రీ)


అందరూ ఆశ్చర్యపోయి తెలివైన వాడవుతాడని అనుకొన్నారు. కన్నతండ్రి కింకేంకావాలి? ఉల్లాసంతో వుప్పొంగి పోయాడు. ఆపల్లె బడిలో వున్న విద్యార్థులందర్లోకి అందానికైతేనేం, శుభ్రతకైతేనేం, చురుకుదనానికైతేనేం, వాసుదే పైచేయి. అందుకే బడిపంతులు కూడా వాసుని యెంతో ముద్దుగా ఆప్యాయంగా చూస్తుండేవాడు.

ఒక్కక్లాసులో కూడా తప్పకుండా అయిదో క్లాసుకి వచ్చేశాడు వాసు. అప్పటికతడికి తొమ్మిదో సంవత్సరం. ఎత్తుగా, చామన చాయగా, మంచి ఆరోగ్యంగా వుండేవాడు.

వాసు యింటి కెదురుగా వుండే ప్రకాశంకొడుకు ధర్మారావు వాసుకి ప్రాణస్నేహితుడనే చెప్పుకోవాలి. ఒక్కక్షణం వాసుని విడిచి వుండేవాడు కాదు. వీళ్ళిద్దరికీ మరెవ్వరితో స్నేహం వుండేది కాదు. ధర్మారావు నిష్కల్మష హృదయం వాసుని మరింత ఆకర్షించింది. ఇద్దరూ ఒకేయీడులో వున్నవారు కూడా. పోతే వాసు తెలివైనవాడు. ధర్మారావు అంత తెలివైనవాడు కాదు గాని అంత మొద్దు కూడా కాదు.

* * *

ఒకనాడు స్కూలు విడిచిపెట్టిం తరువాత వాసు, ధర్మారావు, పుస్తకాలు యింట్లో పడేసి యేటివేపు యిసుకతిన్నెలపైకి పోయారు. అందరిలా పిల్లు ఆడకపోయినా చల్లగాలిలో తిరగాలని, యేదో ఆవచ్చీ రాని పాటలు పాడుకొంటూండాలన్న వాంఛ వుండేది వాసుకి. ఆవూహతోనే ప్రతిదినం అలా పోయేవారు. ఇవాళ కూడా వెళ్తూంటే అక్కడ పిల్లలమూక అగుపించింది. అందులో యెవర్నో పట్టుకుని తలోకసారిగా కొడ్తున్నారు. ఎవరో అరిచెలు పెడుతూ యేడుస్తున్నారు. వాసు ధర్మారావు చేయిపట్టుకుని అక్కడికి పరుగెత్తాడు. మూకనిఛేదించుకుని లోపలికి పోయారు. కసీనం దగ్గరికి రావటానికి

#  వాసు చదువు 

శంకించే వాసు రావటంతో ముక్కడి వాళ్ళక్కడ విడిపోయారు. పాపం! ఓ పదేళ్ళ కుర్రాణ్ణి పట్టు కొడుతున్నారు. ఆ కొత్తబ్బాయి వీళ్ళని చూడ్డంతో కాస్త ధైర్యం తెచ్చుకున్నాడు.

"ఎందుకు కొడుతున్నార్రా?" గద్దించాడు వాసు. అప్పుడు ధర్మారావు వీరుడిలా నడుంమీద చేతులు వేసుకుని నిల్చున్నాడు. అంతా కాస్సేపు నిశ్శబ్దంగా వూరుకున్నారు. ఆ మూకనుండి ఒకడు కాస్త ముందుకొచ్చి

"మేం అందరం గిల్లీదండి ఆడుకుంటున్నాం వాసూ! అతడూ వచ్చి ఆడతానన్నాడు. ఆడించాం గాని ఆడలేకపోయాడు. ఉడుకుమోత్తనంగా మమ్మల్నందర్నీ తిడుతున్నాడు" అన్నాడు. వాసుకి పరిస్థితి అర్థమయ్యింది.

"పోనీలెండోయ్...ఒక్కడని అందరూ కలిసి కొడితే బావుంటుందా? తిట్టాడే అనుకోండి... మీరూ తిట్టెయ్యండి. లేకపోతే పెద్దవాళ్ల దగ్గరికి తీసుకువెళ్లండి" అన్నాడు వాసు బోధపర్చే ధోరణిలో. వాసు తగవులమనిషి కాడని వాళ్లకి తెలుసు. అందుకే అతని మాటకి జవాబు చెప్పకండా ఎవరిమట్టుకు వాళ్లు వెళ్లిపోయారు క్రొత్తబ్బాయిని విడిచి.

"ఏం పేరబ్బాయ్ నీది?" అన్నాడు వాసు.

"రామదాసు" అన్నాడా అబ్బాయి మొహాన్ని చొక్కాతో తుడుచుకుంటూ.

"ఏవూరు? యిక్కడికెలా వచ్చావూ?" రెండు ప్రశ్నలు ఒకేసారి కురిపించాడు ధర్మారావు

"మాది పడమటిదేశం - యీవూరు రెండురోజులక్రితం వచ్చాం. మా మేనమామ పండరిభజన నేర్పుతారు. అతనితో వచ్చాను" అన్నాడు రామదాసు.

"ఊ...సరే, మాతో అలా తిరగటానికి వస్తావా?" అన్నాడు వాసు.

"రాకేం? నాకూ స్నేహితులెవ్వరూ లేక చస్తున్నాను" అన్నాడా అబ్బాయి మొహంలో యేవో భావాలు వ్యక్తపరుస్తూ. వాసుకి అతడి మాటల్లో అదో మాదిరి క్రొత్తదనం కన్పించింది

"ఈ వూరు సంగతి నీకింకా తెలీదు దాసూ! అయితే నువ్వు పాడగలవా?" నడుస్తూ అన్నాడు. ధర్మారావు వాసు ప్రక్కనే మౌనంగా నడుస్తున్నాడు.

"పండరిభజనపాటలన్నీ పాడతా" అన్నాడు రామదాసు. వాసు మెదడులో మెఱుపు మెరిసింది. పాటలు నేర్చుకోవాలన్న అభిలాష అతడికీ వుంది కదూ మరి.

"ఏదీ ఒకపాట పాడు" అన్నాడు వాసు కూర్చుంటూ. ఆ చల్లని వాతావరణంలో యిసుకతిన్నెల మీద కూర్చున్నారు ముగ్గురూ. రామదాసు ఓపాట పాడాడు. వయసులో చిన్నవాడైనా వాసు తన్మయుడైపోయాడు. తనకీ యిలా పాడ్డం వస్తే యెంత బావుణ్ణు? అనుకున్నాడు మనసులో

"నాకీ పాటలన్నీ నేర్పుతావా?" అమాయకంగా అడిగాడు వాసు.

"నాకూ కూడా" అన్నాడు ప్రక్కనుండి ధర్మారావు.

"అలాగే" అన్నాడు రామదాసు కాస్త గర్వంగా.

అప్పట్నుంచీ ముగ్గురూ ఒకరినొకరు విడగీయని స్నేహితులయ్యారు. కొద్దిరోజులు గడచినయ్. వాసు తన శ్రావ్యమైన గాత్రంతో కొన్ని పాటలు నేర్చాడు. ధర్మారావు నేర్వాలని ప్రయత్నం చేసి విఫలుడయ్యాడు.

అయితేనేం రామదాసు స్నేహం వీళ్ళతో అట్టే కాలం నిలవలేదు. ఓరోజు రామదాసు సిగరెట్టు త్రాగుతుండటం చూశాడు వాసు. ఇంత చిన్నతనంలో సిగరెట్ త్రాగటమా! అని ఆశ్చర్యపోయాడు.

"దాసూ! సిగరెట్లు యింత చిన్నప్పట్నుంచే త్రాగటం తప్పు కదూ! అసలు త్రాగనేకూడదు. మానెయ్యాలి మరి..." అన్నాడు వాసు. ఈ మాటలకి దాసుమనసు దెబ్బతింది

"ఇది లేకపోతే వుండలేను వాసూ" అన్నాడు విరక్తిగా దాసు.

"వుండాలి మరి. సిగరెట్లు త్రాగితే గుండెలార్చుకుపోతాయి" అన్నాడు వాసు తను పుస్తకాల్లో చదివినవి నెమరువేసుకొంటూ. దాసుకి బోనులో చిక్కుకున్నట్టనిపించింది.

"అలాగే వాసూ" అని మాత్రం అన్నాడు విధిలేక, వాదించలేక.

ఆ రోజునుండి రామదాసు వాసుకి దూరదూరంగా తిరుగు

తుండేవాడు. మళ్లీ మామూలుగా మిగిలారు యిద్దరు స్నేహితులే - వాసు, ధర్మారావు.

## 2

ఇన్స్పెక్టరు వచ్చి క్లాసు అం తనిఖీ చేస్తాడనీ, అప్పుడే పరీక్ష చేసి అందులో ఉత్తీర్ణులైనవారినే పై క్లాసుకి పంపుతారని బడిపంతులు చెప్పాడు. ఈ వార్త వాసుకెంతో ఆనందాన్ని కలిగించింది. ఒక్క నిమిషంకూడా వృధాగా పోనివ్వకుండా చదువుకునేవాడు. ధర్మారావు అప్పుడప్పుడు వచ్చి చదువుకుని పోతూండటం కద్దు. వాసు తనకి తెలియని విషయాలు బడిపంతుల్ని అడిగి తెలుసుకుంటుండేవాడు. అలా అడిగి తెలుసుకుంటున్నందుకు బడిపంతులు వాసు నెంతో మెచ్చుకునేవాడు.

ఇన్స్పెక్టరు వచ్చే రోజది... వాసు చక్కగా శుభ్రంగా ముస్తాబై ధర్మారావుతో కలిసి బడికి పోయాడు. ఇన్స్పెక్టరు ఒక్కో క్లాసువాళ్లనీ పరీక్ష చేస్తూ చివరికి అయిదో తరగతికి వచ్చాడు. పంతులు తన కుర్చీ అతని కిచ్చి ప్రక్కనే నిల్చున్నాడు. ఇన్స్పెక్టరు ఒక్కసారి క్లాసునంతా కలయజూశాడు. అతని కళ్లకి యిద్దరే పరిశుభ్రంగా కన్పించారు. వాసు-ధర్మారావు.

ఇన్స్పెక్టరు అన్ని విషయాల్లో ప్రశ్నలు వేస్తూనేవున్నాడు. ధర్మారావుకూడా అప్పుడప్పుడు తప్పిపోతుండేవాడు. దేన్నీ తప్పకుండా చెప్పున్నవాడొక్క వాసే. ఇన్స్పెక్టరు గట్టి ప్రశ్న వేశాడు. పిల్లలందరూ తెల్లమొహాలు వేశారు. ఇన్స్పెక్టరు అనుకున్నాడు, అది శాస్త్ర చిక్కుప్రశ్న అని, యెవరూ చెప్పలేరని. అందుకే "ఎవరైనా చెప్పగలరా?" అన్నాడు.

"నేను చెప్తాను సార్.." అంటూ నిల్చుని తకీమని జవాబు చెప్పాడు, వాసు.

బడిపంతులి ముఖం కళకళ లాడింది. ఇన్స్పెక్టరున్నాడన్న ధ్యాస లేకపోతే గంతులేసేవాడు కూడా. ఇన్స్పెక్టరుకూడా నవ్వుతూ కుర్చీలోనుండి లేచి వాసుదగ్గరికి పోయి అతనిభుజంమీద తట్టుతూ—

"చాల చురుకైన కుర్రాడు... ఎవరబ్బాయండీ, మాష్టరుగారూ?" అన్నాడు.

"సూర్యనారాయణని ఓ వ్యవసాయదారుని కొడుకు సార్...తండ్రికూడా వీడిలాగే తెలివైనవాడు!" అన్నాడు నవ్వుతూ పంతులు.

"వారసత్వం వుంటుందంటారందుకే...యిలాంటి అబ్బాయిని పై చదువులకి పంపితే బావుంటుంది" అంటూ వాసు బుగ్గమీద వ్రేలితో మెల్లగా మీటి పోయి కుర్చీలో కూర్చున్నాడు. క్లాసు కుర్రాళ్లంతా వాసు పొందిన మెప్పుకి అసూయపడినా, ధర్మారావు మాత్రం ఆనందించాడు.

ఇన్స్పెక్టరు వెళ్లిపోయిన తరువాత బడిపంతులు వాసుని దగ్గరగా పిల్చాడు వాసు తనదేం తప్పుందోనని బిక్కమొహం వేసుకు వెళ్లాడు.

"నిజంగా నా పరువు దక్కించావురా వాసూ! నీ వల్ల నాకూ పేరొచ్చింది. రిమార్కు లేకండా గ్రాంటు రెకమెండు చేశాడు. నీలాంటివాళ్లుంటే శ్రద్ధగా చదువు చెప్పాలని బుద్ధిపుడుతుంది. అందరికంటె ఫస్టుగా నువ్వుపాసయ్యావు" అన్నాడు పంతులు. వాసు ఆనందంతో గంతులేస్తూ—

"మరి, ధర్మారావంటే?" ఆత్రుతగా అడిగాడు. ధర్మారావు అదోలా ముఖంపెట్టి చూస్తున్నాడు పంతులు ఏం చెప్తాడో అని. "వాడూ పాసయ్యాడు" అని పంతులనడం తడవుగా ఒక్కగంతులో ధర్మారావు దగ్గరికి పోయాడు వాసు. ధర్మారావు ముఖం విప్పారింది. ఆ అమాయకపు మిత్రుల సంతోషం చూసి నవ్వుకున్నాడు బడిపంతులు. తరువాత పాసైనవాళ్లందరి పేర్లు చెప్పాడు. తప్పిన తక్కినవాళ్ళంతా బిక్కమొహాలు వేసుకున్నారు. విచిత్రమేమిటంటే తప్పినవాళ్లంతా పుష్కలంగా డబ్బున్నవాళ్లే.

"తప్పితే వాళ్ళకేం లే...మరో సంవత్సరం చదువుతారు" అన్నాడు వాసు నవ్వుతూ. ఉత్తీర్ణులైనవాళ్ళంతా ఫక్కున నవ్వారు. చివరికి పంతులు కూడా నవ్వాడు. కాస్సేపు పోయాక అంతా యిళ్లు చేరుకున్నారు.

వాసు యిల్లుచేరుకున్న తరవాత జరిగిందంతా తండ్రితో చెప్పాడు. సూర్యనారాయణ అమితంగా సంతోషిస్తూ, ఆనందబాష్పాలు తుడుచుకున్నాడు.

"ఎందుకేడుస్తున్నావు నాన్నా?" అమాయకంగా అడిగాడు వాసు. అతడికేం తెలుసు అవి ఆనంద బాష్పాలని? సూర్యనారాయణకి నవ్వొచ్చింది. -

 # వాసు చదువు 

"ఏడుపు కాదురా - ఆనందాతిశయంతో యిలా కన్నీళ్లు కారతాయి" అన్నాడు నవ్వుతూ.

"ఓస్! అంతేనా?" అంటూ వీధిలోకి వురికాడు వాసు.

ఇప్పుడు సూర్యనారాయణకి పెద్ద సమస్య యేర్పడింది. 'కొడుకు చదువు ఆ పల్లెలో అయిపోయింది. పై చదువు చదివించటం యెలా? ఎక్కడ చదివించటం?' అని. బడి పంతులూ యింకా కొందరు యెన్నో సలహాలిచ్చారు. కాని సూర్యనారాయణ యే ఒక్క నిశ్చయానికీ రాలేకపోతున్నాడు.

## 3

వరహాలు సూర్యనారాయణ చెల్లెలు. ఆమె పట్నంలో వుంది ఆ మొటినాడు అన్నగారింటికొచ్చింది. చెల్లెల్ని చూడ్డంతోనే సూర్యనారాయణకి యేదో ఆలోచన మెదిలింది.

"ఏదో యిన్నాళ్ళకి మాయింటికొచ్చావు చెల్లాయ్" అన్నాడు సూర్యనారాయణ.

"ఎప్పుడు వచ్చేదన్నయ్యా! మొన్ననే కదా, కలకత్తానుండి వచ్చాను..." అంది. వాసు ఆమె ప్రక్కనే నిల్చుని అదోలా చూస్తున్నాడు. వరహాలు వాణ్ణి పరకాయించి చూస్తూ-

"ఎంత వాడివయ్యావురా! యేం చదువుతున్నావ్?" అంది. వాసు నవ్వుతూ యేదో చెప్పాలనుకుంటుండగా సూర్యనారాయణ అందుకున్నాడు.

"మొన్ననే అయిదో తరగతి పాసయ్యాడే - అదీ యెలాగను కున్నావ్? మంచి మార్కులతో; యిన్‌స్పెక్టరు వీణ్ణి యెంతగానో మెచ్చుకున్నాడట."

"ఆ! అలాగా... ముఖమే చెప్తోందిలే, తెలివైనవాడని" అంది వరహాలు.

"మనమ లిక్కడే వున్నారా?"

"లేకపోతే మరెక్కడికి పోతారు?"

"ఏం చదువుతున్నారేమిటి?" ఆసక్తితో అడిగాడు సూర్యనారాయణ.

"పెద్దవాడు కామేశం ఆరో తరగతి, చిన్నవాడు విశ్వం నాలుగో తరగతీను."

"బుద్ధిగా చదువుకుంటున్నారు కదూ?"

"ఆ! యేం చదువు— యెండాకాలం చదువంటారందుకే. ఎప్పుడు చూచినా ఆటలతో సరిపోతుంది మరి అన్నయ్యా! వాసుని యెక్కడ చదివించాలనుకుంటున్నావ్?" అంది వరహాలు ఆ ప్రసక్తి తనకి తానుగా చెల్లెలు తెచ్చినందుకు ఆనందించాడు సూర్యనారాయణ.

"అదే ఆలోచిస్తున్నాను వరహాలూ! నీకు తెలీందేముంది? ఏ విశాఖపట్నంలోనో, విజయనగరంలోనో, అయితే నాకు చదివించటానికి శక్తిలేదని నీకు మాత్రం తెలీదూ? వాడికి చదువుకోవాలన్న కోరిక వుంది. వాడు చదివి, బాగుపడ్డం చూడాలని నాకూవుంది. కాని అది మన చేతుల్లో వుందా? అంతా భగవదిచ్ఛ. సమయానికి నువ్వొచ్చావు..." అన్నాడు. సూర్యనారాయణ.

వరహాలుకి అన్నమాట లేం అర్థంకాలేదు. ఎంతో తెలిసినట్టు ఒక్కనవ్వు నవ్వి వూరుకుంది. అయితేనేం సూర్యనారాయణ తన మనసులో దాగున్న అభిప్రాయాన్ని వెలిబుచ్చలేదు అప్పుడే.

మూడురోజులుండి నాలుగో రోజు సాయంకాలం వెళ్ళిపోవాలనుకుంది వరహాలు నాలుగోరోజు వుదయం సూర్యనారాయణకొడుకు చదువు ప్రస్తావన యెత్తాడు.

"చెల్లాయ్, కుర్రాడి అభిలాష, వుత్సాహం చూస్తే వాడి చదువు విషయంలో నిస్సహాయుణ్ణి అయినం




—వి. మురళి (5), సికింద్రాబాద్.

దుకు నాకే సిగ్గేస్తుంది. వాడి చదువు భారమంతా నీ చేతుల్లో పెట్టాలని మొన్నాళ్లనుంచో అనుకుంటున్నాను" అన్నాడు సూర్యనారాయణ.

ఇప్పుడంతా అవగాహన చేసుకోగలిగింది వరహాలు. అప్పుడే తన సమ్మతిగానీ, అభిప్రాయాన్నిగానీ, తెలియబర్చలేకపోయింది. కొడుకుల యింట్లో తనకు లేని స్వతంత్రం జ్ఞాపకానికి వచ్చింది. కాని, చూస్తే అన్నయ్యకొడుకు... ఆమెలో అదోలాంటి బాంధవ్యం మొలకెత్తింది.

"నాయింట్లో నాకు స్వతంత్రం లేదని నీకు తెలిసిందే కదన్నయ్యా! అబ్బాయిల్నడిగి చెప్తాను. నాకు మాత్రం వానంటే అభిమానం లేదూ? వీడియుత్సాహం చూస్తుంటే నాకూ అలానే అన్పిస్తోంది. నేను వెళ్ళి యీసంగతి తెలియబరుస్తాను. అసలు మాయింట్లో మగాళ్లు హూఁ కొట్టినా కోడళ్లుమాత్రం ఒప్పుకుంటారో లేదో?"

"ఆమాత్రం నువ్వు చెప్పలేవూటే — వీడుకూడా నీ మనుమల్లో ఒకడనుకోకూడదూ! ఆ పుత్రాళ్ళతో పాటు పెరుగుతుంటాడు" అన్నాడు సూర్యనారాయణ నవ్వుతూ. వాసు వీళ్ల సంభాషణ ఆసక్తిగా వింటున్నాడు.

"చూస్తాలే అన్నయ్యా" అంది వరహాలు.



'పిల్లడి చెలగాటం పిల్లికి ప్రాణసంకటం'
—ఫొటో : ఎన్. రామకృష్ణ, మాయవరం.

# వాసు చదువు

"చూస్తానంటే కాదు చెల్లీ... నువ్వు గట్టిపట్టు పట్టాలి. నేనూ నా చేత నయిన మట్టుకు సహాయం చేస్తుంటాను" అన్నాడు సూర్య నారాయణ. వాసు వుత్సాహంగా తండ్రి భుజాన్ని నొక్కాడు.

"అలాగేలే అన్నయ్యా" అంది వరహాలు. వాసు వుత్సాహంతో వుక్కిరి బిక్కిరయ్యాడు. అప్పుడే పట్నంలో చదువుతున్నట్టుగా భావించుకున్నాడు.

ఆరోజు సాయంకాలం నాలుగ్గంటలకి వరహాలు బయలుదేరి పట్నం వెళ్లిపోయింది. యథాప్రకారం అయిదు గంటలకి వాసు, ధర్మారావు మళ్లీ యిసుక తిన్నెలమీదికి పోయారు.

"ధర్మా! నేను పట్నం పోతున్నారా" అన్నాడు వాసు. అసలు ఆ విషయం యెంత వేగిరం ధర్మారావు చెవిలో వడేద్దామా అన్న ఆత్రుతతో వున్నాడు వాసు.

"ఆ! అదెప్పుడు?" ఆశ్చర్యంగా అడిగాడు ధర్మారావు.

"మా అత్తయ్య వచ్చింది కదూ! మానాన్న వాళ్లింటికి నన్ను చదువుకోసం పంపుతారట" అన్నాడు వాసు.

"మీ అత్తయ్య యేమంది?" చప్పున ప్రశ్నవేశాడు ధర్మారావు.

"అలాగే నంది"

"మరింకేం - నువ్వు పట్నం వెళ్లిపోతావన్న మాట" అన్నాడు ధర్మారావు. ఆ అమాయకపు హృదయంలో అర్థంకాని ఆవేశం, ఆరాటం తొంగిచూస్తున్నయ్

"నువ్వు కూడా వచ్చేయకూడదూ?" అన్నాడు అమాయకంగా వాసు.

"ఏమో చెప్పలేనురా ..."

"మీకేం — డబ్బు లేదుగనకనా! పట్టు పడుదూ, మీనాన్న పంపిస్తాడు."

"నిజమే అనుకో! చూద్దాంలే"

"మళ్లీ యెప్పుడు యీ యిసుక తిన్నెలమీద కల్సుకుంటామో?" పట్నం తప్పకుండా పోతానన్న ధైర్యంతో అన్నాడు వాసు.

"అప్పుడప్పుడొస్తూంటావు కదూ?" అన్నాడు ధర్మారావు. తను పట్నం పోవటం సందిగ్ధంలో వుందని అతని నమ్మకం. వాసు స్నేహితుని అభిప్రాయం తెలుసుకున్నప్పటికీ ఒత్తిడిచేసి మరేం అడగలేదు.

అప్పుడే సూర్యుడు కొండ చాటుకి పోతున్నాడు. నీటిలో సూర్యాస్తమయ ఛాయలు దూరంలో స్పష్టంగా కన్పిస్తున్నయ్. చీకటి రాత్రులవటం వల్ల ఒక్కసారిగా చీకటి అలముకుంది. మిత్ర ద్వయం యింటిముఖం పట్టారు.

(సశేషం)

★

## శ్యామల జయరామరెడ్డి

నాన్నగారి పార్కరు పెన్నుతో వ్రాసి చూడాలని గోపీ ఎన్నాళ్ల నుంచో కలలు కంటూ ఉండేవాడు. తళతళ మెరిసే ఆ బంగారు కాపు చూస్తూంటే ఎంతో ముద్దొచ్చేది. కాని పెన్ను ముట్టుకొంటే నాన్నగారు తంతారని భయం. అందువల్ల దాన్ని తీసి వ్రాయటానికి భయపడేవాడు. ఎన్నాళ్లున్నా పార్కరుపెన్‌తో వ్రాయాలన్న కల కలగానే ఉండిపోయింది.

ఆరోజు మన ప్రధాన మంత్రి నెహ్రూ వస్తున్నాడని స్కూలుకి సెలవిచ్చారు. పార్కులో బహిరంగ సభకు పెద్దగా ఏర్పాట్లు జరుగుతున్నాయి. గోపీ ప్రొద్దున్నే అన్నం తిని పార్కులోకి వచ్చాడు. గోపీ నాన్నగారు అక్కడే ఉండి కూలీల చేత పనులు చేయిస్తున్నారు. అందువల్ల గోపీ పార్కులో నుంచి పెద్ద బజారుకు వచ్చాడు. రోడ్డు రెండు ప్రక్కలా, కాంగ్రెసు జండాలు, తోరణాలు కట్టడం వల్ల బజారంతా క్రొత్తగా, అందంగా ఉంది. పోలీసు వాళ్లు గ్రూపులు గ్రూపులుగా మార్చింగ్ చేస్తూపోతున్నారు. గోపీకి వాళ్లను చూస్తుంటే ఉత్సాహం ఎక్కువైంది. కాస్సేపు వాళ్లను చూస్తూ వాళ్ల వెనకాలే వెళ్లాడు. మీటింగు జరిగేది నాలుగుగంటలకైనా అప్పుడే బజార్లన్నీ జనంతో నిండిపోయాయి. ఊరంతా ఎక్కడ చూసినా పల్లెటూరి క్రొత్తముఖాలు కనపిస్తున్నాయి. ఎప్పుడు చూసినా ఖాళీగా ఉండే కాఫీ హొటలు కూడా జనంతో కిటకిట లాడుతూంది. ఇవన్నీ చూస్తూ గోపీ ఊరంతా తిరిగాడు. మార్కెట



# ★ పార్కరు పెన్ను ★

మీద సైరను పన్నెండు కూసింది. గోపీకి ఆకలైంది. ఇంటికి వచ్చి అన్నం తిన్నాడు. అమ్మ "అలా ఊరంతా గాడిదలాగా తిరగకపోతే కాస్సేపు పండుకోరాదూ?" అని కేకలేసింది. గోపీకి నిద్రపట్టక పోయినా పడుకొన్నాడు అమ్మ భయంవల్ల. నాలుగు ఎప్పుడౌతుందా అని అనుకొంటూనే నిద్రపోయాడు.

మూడు గంటలకు అమ్మ గోపీని నిద్రలేపి కాఫీయిచ్చింది. గోపీ తొందర తొందరగా నాలుగు చెంబులు నీళ్లు పోసుకొన్నాడు. "డ్రాయర్లో బీరువా తాళం చెవులు తీసుకొని నీ బట్టలు తీసుకోరా" అన్నది అమ్మ ఏదో పని చేసుకొంటూ. గోపీ డ్రాయరు తెరిచాడు తళతళ మెరుస్తూ పార్కరుపెన్ను కనిపించింది. తొందరగా బట్టలు వేసుకొన్నాడు. కొత్తచొక్కా చక్కగా మెరుస్తూంది. "పార్కరు పెన్ను జేబులో పెట్టుకొంటే ఎలా వుంటుందో" అనుకొన్నాడు గోపీ. వెంటనే పెన్ను తీసి జేబులో పెట్టుకొన్నాడు. 'భలేగా ఉంది' అనుకొన్నాడు. వెంటనే ఒక ఆలోచన వచ్చింది.

"పెన్నుతో వ్రాయకుండా ఊరికినే, సరదాగా జేబులో పెట్టుకొని తిరిగితే ఏం చెడిపోతుందబ్బా" అనుకొన్నాడు. అందులో నాన్న గారు కూడా ఇంట్లో లేరు! ఈ ఆలోచన గోపీకి భలేగా నచ్చింది. ఇంతలో క్లాసుమేటు రాముడు పరుగెత్తుకుంటూ వచ్చాడు. "ఒరేయి గోపీ నెహ్రూగారు పెద్ద బజార్లు గుండా పార్కుకు వెళతాడట్రా. మనం బజార్లోనే చూద్దాం రా రా!" అన్నాడు ఒగర్చుకొంటూ గుక్క త్రిప్పుకోకుండా. వెంటనే ఇద్దరూ కలసి పెద్దబజారుకు పరిగెత్తారు. పార్కరుపెన్ను ఎక్కడ పడిపోతుందోనని భయంతో జేబు ఒకచేత్తో పట్టుకొన్నాడు.

పెద్దబజార్లో జనం అప్పుడే గుంపులు కూడారు. రోడ్డుకు రెండు వైపులా గజానికొక పోలీసుచొప్పున నిలబడి జనం రోడ్డుమీదకు త్రోసుకు రాకుండా చూస్తున్నారు. ముందుకు పోవటానికి వీలు చిక్కలేదు. ఆ ఒత్తిడిలో రాముడు గోపీ చెయ్యి విడిచిపెట్టి జనంలో కలిసిపోయాడు. మళ్ళీ కనిపించలేదు.

గోపీ ఒక్కడే ముందుకు పోవాలని ప్రయత్నించాడు. కాని వీలు చిక్కలేదు. ఉండి ఉండి ఒక్కసారి వెనక నుంచి ఒక్కతోపు తోశారు. ఆ దెబ్బతో గోపీ ముందున్న ఒక మనిషి మీద పడ్డాడు. ఖాకీ చొక్కా, గళ్లలుంగీ చుట్టుకొన్న ఆ మనిషి "కౌన్ హై తూ?" అంటూ వెనక్కు తిరిగాడు. జనం వత్తిడిలో పార్కరు పెన్ను ఎక్కడ పోతుందోనన్న భయంతో ఎందుకు వచ్చానా అనుకొంటున్నాడు గోపీ. ఖాకీచొక్కామనిషి గోపీని చూసి జాలిపడ్డాడు. "ఇట్లారా తమ్ముడూ! నాముందు నిలబడి చూద్దువుగాని" అన్నాడు యాసతో. గోపీ సంతోషంతో అతని ముందుకు వెళ్లి నిలబడ్డాడు. తనముందు మరెవ్వరూ లేనందువల్ల గోపీకి ఇప్పుడు బాగా కనిపిస్తూంది. వెనకనున్న ఖాకీ చొక్కామనిషి గోపీ భుజం మీద చెయ్యివేసి నిలబడ్డాడు. గోపీ పార్కరు పెన్ను మీద చెయ్యి తియ్యలేదు.

రోడ్డుమీద పోలీసు కార్లు, మోటారుసైకిళ్ళు హడావిడిగా తిరుగుతున్నాయి. ఒక పోలీసువాను మీద లౌడ్‌స్పీకర్లు పెట్టి ప్రజలంతా రోడ్డు దిగి ప్రశాంతంగా ఉండమని విజ్ఞప్తి చేస్తున్నారు. జనంలోనుంచి 'పండిట్ నెహ్రూకి జై' అని నినాదాలు వినిపిస్తున్నాయి. నెహ్రూ ఇంకా రాడేమా అని గోపీ ఆలోచిస్తున్నాడు. ఇంతలో దూరంగా గోల ఎక్కువైంది. 'పండిట్ నెహ్రూకు జై' అని కేకలు మిన్నుముట్టాయి. వెంటనే ఒక పోలీసు వ్యాను, రెండుమూడు కార్లు వచ్చాయి. తరువాత ఒక

జీపుకార్లో నెహ్రూ నవ్వుతూ ప్రజలకు నమస్కారం చేస్తూ నిలబడ్డాడు. గోపీకి ఉత్సాహం ఎక్కువైంది. రెండుచేతులూ పైకెత్తి 'నెహ్రూకి జై' అని అరిచాడు ఉత్సాహంగా. వెంటనే రకరకాల మిషన్లతో ఇంకొక జీపుకారు వచ్చింది. ముందు ప్రక్క స్టాండుమీద ఒక పెద్ద కేమెరా ఉన్నది. ప్రక్కనే ఒక మనిషి నిలబడి కెమెరాలోంచి చూస్తున్నాడు.

కెమెరా నెహ్రూవైపుకు తిరిగివుంది. గోపీ ఉత్సాహంతో కెమెరా వైపు చూస్తున్నాడు. జనంలోనుంచి ఎవరో 'సినిమా తీస్తున్నారోయ్' అని అరిచారు. ఇంతలో జీపుకారు గోపీ ఉన్న చోటికి చాల దగ్గర్లోకి వచ్చింది. ఉన్నట్లుండి కెమెరా జనంవేపుకు తిరిగింది. మరో అరనిమిషానికి కెమెరావున్న జీపుకారు గోపీ ముందుగా దాటిపోయింది. కెమెరా క్లిక్ క్లిక్ క్లిక్ అని శబ్దంచేస్తూ కారుతోపాటు గోపీముందుగా పోయింది. తరువాత నాలుగైదు కార్లు వచ్చినై. అప్పటికప్పుడే జనం పార్కు వేపుగా బయలుదేరారు.

గోపీకూడ వెనక్కు తిరిగాడు. తనకుపిలచి చోటిచ్చిన ఖాకీ చొక్కా మనిషి కనిపించలేదు. ఇంటికి వెళ్దామని బయలుదేరాడు గోపీ. నగందూరం వచ్చాక చెయ్యి అప్రయత్నంగా జేబులోకి పోయింది. పార్కరుపెన్ను లేదు! గోపీగుండె ఆగిపోయింది. ఏం చేస్తాడు?—ఆజనంలో ఎవరు కొట్టేశారో? ముఖం వేలాడేసుకొని ఇంటిత్రోవ పట్టాడు.

ఆపూట గోపీకి అన్నంతిన బుద్ధి పుట్టలేదు. నాన్నగారు అడిగితే ఏమి చెప్పాలా అన్న భయం పట్టుకొంది. దేముడి దయవల్ల నాన్నగారు ఇంకా ఇంటికి రాలేదు. వస్తే ఏమంటారో? అరవైరూపాయల పెన్ను! 'అమ్మో' అనుకొన్నాడు గోపీ. అసలు తనదే బుద్ధితక్కువ. పెన్ను తీసుకెళ్లటమే తప్పు. అందులో అంత ఒత్తిడిగా ఉన్న జనంలోకి! నాన్నగారు రాగానే పెన్ను కోసం వెతుకుతారు. కనిపించకపోతే ఏమని చెప్పాలి?——తనే వెళ్ళి నాన్నగారికి అంతా చెప్పేస్తే? ఏమంటారో? ఏమన్నా సరే. తప్పు చేసింది తనుకాబట్టి తనే వెళ్ళి చెప్పాలి నాన్నగారికి. ఈ ఆలోచన మనసులోకి వచ్చేసరికి గోపీగుండె కొంతవరకు కుదటబడింది.

తొమ్మిది గంటలకు నాన్న ఇంటికి వచ్చారు. వెంటనే భోంచేసి గదిలోకి వెళ్ళిపోయారు. గోపీ ధైర్యంచేసి మెల్లగా గదిలోకి వెళ్ళి తలుపు నానుకొని నిలబడ్డాడు. పేపరు చదువుతూన్న వాళ్ళ నాన్న తలెత్తి చూశాడు.

"ఏం బాబూ?" అన్నాడు మృదువుగా.

గోపీ చెప్పలేకపోయాడు. తలొంచుకొని ఏడుస్తున్నాడు. నాన్న లేచివచ్చి గోపీతలని నిమురుతూ 'ఫరవాలేదులే చెప్పు బాబూ' అన్నాడు. గోపీ ఎలాగైతేనేం ధైర్యం చేశాడు.

"పెన్ను పోయిందండీ" అన్నాడు మెల్లగా.

"అంతేకద రెండు రూపాయలు పెడితే ఇంకొకటి వస్తుంది. దానికింత భయమెందుకు."

"కాదండి, పార్కరు పెన్ను—"

నాన్న క్షణంసేపు నిశ్శబ్దంగా వున్నాడు. గోపీ ముందుగా వచ్చి నిజం చెప్పినందుకు సంతోషంతో పొంగిపోయాడు. చివరకు అన్నాడు,

"పోనీలే. ఏంచేస్తాం—" గోపీ వాళ్ళనాన్నను కౌగలించుకొని ఏడిచాడు.

గోపీ ఆ రాత్రి నిద్రపోయినంత గాఢంగా, సంతోషంగా ఎప్పుడూ నిద్రపోలేదు.

* * *

వారంరోజులు గడిచిపోయాయి. నాన్నగారు పెన్నుసంగతి ఏమీ ఎత్తలేదు. గోపీకూడ ఆ విషయం దాదాపు మర్చిపోయాడు. ఆ రోజు ఆదివారం. నాన్నగారు మ్యాటినీ సినిమాకు వెళ్ళివచ్చారు. ఆ రోజంతా ఎందుకో సంతోషంగా ఉన్నారు. మర్నాడు సాయంత్రం స్కూలునుంచి రాగానే గోపీని గదిలోకి పిలిచాడు. గోపీ వెళ్ళేప్పటికి వాళ్ళనాన్న ఏదో వ్రాసుకొంటున్నారు. గోపీ హఠాత్తుగా ఉలిక్కిపడ్డాడు నాన్నగారిచేతిలో ఉన్న కలం చూసి. అదే! - ఆ పోయిన పార్కరుపెన్ను! ఆ బంగారపు క్యాపు అచ్చం అదే! 'ఆశ్చర్యంగా ఉందే. ఎలా దొరికిందబ్బా' అనుకొన్నాడు గోపీ. కాని అడగటానికి ధైర్యం చిక్కలేదు. క్రొత్త పెన్నేమో అనుకున్నాడు మళ్ళీ.

"ఇవ్వాళ సినిమాకు వెళ్దాం. త్వరగా భోజనంచేసి రెడీగా ఉండు" అన్నారు తలెత్తి.

# ★ పార్కరు పెన్ను ★

వెంటనే గోపీ పరుగెత్తుకుంటూ వెళ్ళాడు సంతోషంతో. వెళ్ళి అమ్మకు చెప్పాడు. అమ్మ అంతకు ముందే రెడీగా వుంది. గోపీ అరగంటలో తయారైనాడు. నాన్న, అమ్మ, తనూ, చెల్లాయి అందరూ గుఱ్ఱంబండి ఎక్కారు. సగం దూరం పోయాక నాన్నగారు అమ్మవేపు చూసి "నా పెన్ను దొరికింది'' అన్నాడు. అమ్మ సన్నగా నవ్వి వూరుకుందిగాని ఎలా దొరికిందని అడగలేదు. గోపీ వుండలేక చివరికి అడిగాడు ఎలాదొరికిందని.

'తరువాత చెప్తాలే' అన్నారు. గోపీ మళ్ళీ మాట్లాడలేదు. బండి సినిమాహాలుముందు ఆగింది.

టిక్కట్లు తీసుకొని లోపలకు వెళ్ళాక కొంచెం సేపటికి బెల్ కొట్టి సినిమా మొదలుపెట్టారు. ముందు న్యూస్‌రీల్ చూపిస్తున్నారు. 'ఆంధ్ర దేశంలో ప్రధాని నెహ్రూ పర్యటన' అని పెద్ద అక్షరాలు తెరమీద పడ్డాయి. వెంటనే జీపు కార్లో ఉన్న నెహ్రూ కనిపించాడు. నవ్వుతూ ప్రజలకు నమస్కారం చేస్తున్నాడు. గోపీ పరీక్షగా చూశాడు. ఆ ఊర్లో జరిగిన ఊరేగింపునే చూపిస్తున్నారు. గోపీకి ఉత్సాహం ఎక్కువైంది. తను స్వయంగా చూసింది మళ్ళీ తెరమీద చూస్తున్నాడు. అదుగో! నెహ్రూ! మళ్ళీ తను ప్రత్యక్షంగా చూస్తున్నట్లే ఉంది. ఆ పెద్ద బజారు, ఆ కార్లు అన్నీ తనకు బాగా గుర్తు! ఉన్నట్లుండి కెమెరా జనంవేపుకు తిరిగింది.

రోడ్డుప్రక్క నిలుచున్న జనాన్ని వరుసగా చూపిస్తున్నారు. వాళ్లలో చాలమంది తను ఎరిగినవాళ్ళే! అరెరె అదేమిటి? అక్కడ నిలబడిందెవరు? తను కదూ? నిజంగా అక్కడ ఉంది గోపీయే! తెరమీద తన బొమ్మ! భలేగా ఉంది. అదుగో తనవెనుక నిలబడ్డ ఖాకీచొక్కా, గళ్ళలుంగీ మనిషి! తను ఉద్రేకం పట్టలేక 'నెహ్రూకి జై' అని చేతులెత్తి అరవటంగూడ స్పష్టంగా కనిపిస్తూంది! —— అరెరె అదేమిటి! ఖాకీచొక్కా మనిషి తన జేబులో చెయ్యి పెడుతున్నాడు! అదుగో ఏమిటో తీశాడు. -పెన్ను! "పార్కరుపెన్! వీడా దొంగ!— నాన్నగారూ, నాన్నగారూ, మీ పెన్ను అదుగో! వాడు తీస్తున్నాడు దొంగవెధవ?" గోపీ ఉద్రేకంతో అరుస్తున్నాడు

# ఉత్తమ చిత్రాలకు ప్రభుత్వ బహుమతులు

## నీతిబోధలవల్ల ప్రయోజనంలేదు

భారతీయ చిత్రాల్లో కళా ప్రమాణాలను, శిల్ప ప్రమాణాలను అభివృద్ధి చేసేందుకు, ఉత్తమస్థాయినందుకున్న చిత్రాలను ప్రోత్సహించడానికి భారత ప్రభుత్వం బహుమతులివ్వ నిశ్చయించి, ఉత్తమ చిత్రాలుగా నిర్ణయించబడిన వాటికి ఈ నెల పదో తేదీన బహుమతులు ప్రసాదించింది.

బహుమతిప్రదానసభ న్యూఢిల్లీలో నేషనల్ ఫిజికల్ ఆడిటోరియమ్‌లో జరిగింది. రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ బహుమతు లందజేశారు. ఉత్తమ కథా చిత్రం బహుమతిని "శ్యాంచీ ఆయీ" అనే మరాఠీ చిత్రమూ, ఉత్తమ డాక్యుమెంటరీ బహుమతిని "మహాబలిపురం" చిత్రమూ పొందాయి. "శ్యాంచీ ఆయీ" నిర్మాత పి. కె. అత్రే, "మహాబలిపురం" నిర్మాత జగత్ మురారీ ఈ బహుమతు లందుకున్నారు.

ప్రభుత్వానికీ, సినిమా పరిశ్రమకూ కొన్ని ఏళ్ళనుంచీ ఘర్షణ జరుగుతోంది. దేశంలో తయారయ్యే చిత్రాల నైతికస్థాయి దిగజారిపోతోందని ప్రభుత్వం ఆరోపిస్తోంది. ప్రభుత్వం తమ పరిశ్రమమీద భరింపరాని పన్నులు వేసి అభివృద్ధిని అటకాయిస్తోందనీ, సెన్సార్‌షిప్ నిబంధనలను యిష్టంవచ్చినట్లు అమలు చేస్తోందనీ, రేడియోలో ఫిలిం సంగీతానికి తావులేకుండా చేసి తమ ప్రతిపత్తికి భంగం కలిగిస్తోందనీ ఫిలింపారిశ్రామికులు ఆరోపిస్తున్నారు. ఈ ఘర్షణవల్ల ఉభయులమధ్యా స్పర్థలు నానాటికీ పెరిగి విపరీతదశలకు దారితీస్తున్నాయి. ఈ తరుణంలో భారత ప్రభుత్వం తమ సుహృద్భావానికి సూచనగా, ఉత్తమచిత్రాలను ప్రోత్సహించేందుకు ఏటేటా బహుమతు లివ్వడానికి నిశ్చయించుకున్నది. ఈ బహుమతి ప్రదానంవల్ల చిత్రనిర్మాతల్లో ఉత్తమ చిత్రాలు నిర్మించి బహుమతులుపొందాలనే ఆసక్తి కలిగి, కళా, శిల్పప్రమాణాలు అభివృద్ధి అయ్యే అవకాశం ఉందని కేంద్ర సమాచార శాఖామంత్రి డా॥ కేస్కార్ బహుమతి ప్రదాన సభలో ఉపన్యసిస్తూ ఆశించారు.

అయితే ఈ బహుమతులవల్ల చాల పరిమిత ప్రయోజనం మాత్రమే ఉంటుంది తప్ప, ఇంతలో చలనచిత్ర పరిశ్రమ యావత్తూ ఉత్తమస్థాయిని సాధించడానికి ఉన్ముఖం అవుతుందనిగాని, పరిశ్రమకూ ప్రభుత్వానికీ స్నేహసంబంధాలు ఏర్పడతాయనిగాని ఆశించడం ఆధారరహితమే అవుతుంది. ప్రభుత్వం ఉత్తమ చిత్రాలను పరిగణించడానికి ముందంజ వేయడం ఎంత హర్షించదగిన దైనప్పటికీ, అది కళ్ళనీళ్ళు తుడవడంగానే ఉండిపోతుంది.

### రాష్ట్రపతి హెచ్చరిక

రాష్ట్రపతి బహుమానాలు అందజేసే సందర్భంలో ఉపన్యసిస్తూ, చలనచిత్రాల పట్ల ప్రభుత్వవైఖరిని విస్పష్టం చేశారు. సినిమా పారిశ్రామికులు ప్రజాహితం, దేశ శ్రేయస్సు ప్రధానలక్ష్యంగా పెట్టుకుని పనిచేయాలి. ప్రజాహిత చింతనకూ, వ్యాపారవిజయానికీ విధిగా విరోధం ఉండనవసరం లేదు. ప్రజాసేవకు పనికిరాని వ్యాపారవిజయం నిరర్థకం. సినిమా మహత్తరమైన సాధనం. పుస్తకాలకంటే, నాట

"శ్యాంచీ-ఆయీ" నిర్మాత పి. కె. అత్రేగారికి డా॥ రాజేంద్రప్రసాద్ స్వర్ణ పతకం ఇచ్చి గౌరవిస్తున్న దృశ్యం.



---

నాన్నగారు నవ్వుతూ గోపీని నోరు మూసి కూర్చోబెట్టాడు. గోపీ మళ్ళీ ఈ లోకంలోకి వచ్చాడు. వాళ్ళ నాన్న అమ్మతో చెపుతున్నాడు—

"నేను నిన్ననే మాట్నీ చూశాను. ఆ ఖాకీచొక్కా, గళ్ళ లుంగీ మనిషి గుజ్జంబండి వాడు. వాణ్ణి నేను చాలాసార్లు చూశాను. వెంటనేవెళ్ళి పోలీసు రిపోర్టు చేస్తే వాణ్ణి పట్టుకొచ్చారు. నాలుగు తన్నేటప్పటికి కలం ఎక్కడ కుదువ పెట్టాడో చెప్పాడు. నేను వెళ్ళి వెంటనే తీసుకొచ్చాను. పోలీసులు వాడిమీద కేసుపెట్టారు. దొంగ వెధవ! తప్పకుండా శిక్షపడుతుందనుకో! ఈ ఫిలిం మూలాన్నే మన పెన్ను మనకి దొరికింది." గోపీ నోరుతెరిచి సంతోషంగా వింటున్నాడు. ★

## రష్యాలో ఫిలిం ప్రతినిధులు

లామొనోసొవ్ స్టేట్ యూనివర్సిటీ భవనం (మాస్కో)వద్ద భారతీయ ఫిలిం ప్రతినిధులు; బిమల్ రాయ్, నిరూపరాయ్, నర్గీస్, రాజ్ కపూర్, దేవ్ ఆనంద్, అబ్బాస్ మున్నగువారిని ఈ ఫోటోలో చూడవచ్చును.

 ## ప్రభుత్వ బహుమతులు 

కాలంలో సినిమాలు శక్తివంతమైనవి. అందుచేత సినిమాల నిర్మాణం మరింత బాధ్యతాయుతమైనది. సినిమాలకు ముఖ్యంగా మూడు ప్రయోజనాలున్నాయి: విద్య, వినోదం, ఉత్తమ భావప్రచారం. ప్రస్తుతం మన చిత్రాలు వినోద ప్రయోజనాన్నే దృష్టిలో పెట్టుకుని మిగతా రెండు ప్రయోజనాలనూ విస్మరిస్తున్నాయని అనేకులు చెబుతున్నారు. ఆ వినోదంకూడా చవకబారు అభిరుచులను, ప్రవృత్తులను సంతృప్తిపరిచేదిగా మాత్రమే ఉంటోం

దని పలువురు మిత్రులు అంటున్నారు. ఇటువంటి వినోదం నిష్ప్రయోజనం, హానికరంకూడాను. ఈ చవకబారు వినోద చిత్రాలకే ఎక్కువ ప్రజాదరణ ఉండవచ్చును. వాటికే ఎక్కువ డబ్బురావచ్చును. చిత్రనిర్మాణం భారీ వ్యాపారం గనుక ఏమాదిరి చిత్రాలకు డిమాండు ఎక్కువగా ఉంటో ఆమాదిరి చిత్రాలనే తాము తయారుచేస్తామని కొందరనవచ్చును. వినోదం కలిగించడమే చిత్రాల ప్రధానలక్ష్యమనీ, కనుక ప్రజల అభిరుచి ఎలా ఉంటే అలాగే చిత్రాలు తీస్తామనికూడా కొందరనవచ్చును. ఇదంతా శుష్కవాదన. ప్రజాశ్రేయస్సు చిత్ర నిర్మాతల లక్ష్యంగా ఉండాలి. ప్రజాశ్రేయస్సుకూ, వ్యాపార విజయానికీ విరోధం ఉండనక్కరలేదు. ప్రజాశ్రేయస్సును తోసిపుచ్చిన వ్యాపార విజయం నిరర్థకం.

డా॥ రాజేంద్రప్రసాద్ తమ ఉపన్యాసంలో, చిత్రనిర్మాతలకు ఒక హెచ్చరికను సూచనప్రాయంగా తెలియజేశారు: సంఘక్షేమాన్ని విస్మరించి లాభార్జించే స్వార్థపరులను అరికట్టడానికే ప్రతి దేశంలోనూ శిక్షాస్మృతి ఒకటి ఉంటూ ఉంటుంది. స్వార్థపరులులేని దేశంలో శిక్షాస్మృతియొక్క అవసరమే లేదు. అయితే అటువంటి ఆదర్శదేశం ఇంతవరకూ ప్రపంచంలో మనకెక్కడా కనిపించదు. అందుచేత శిక్షాస్మృతి ఉండక తప్పదు. చిత్రనిర్మాణంపై కూడా ప్రభుత్వానికి ఏదో

మాస్కోలో స్వెర్డ్లావ్ స్క్వేర్‌వద్ద "ఆవారా" పోస్టర్.



# ప్రభుత్వ బహుమతులు

రకమైన కంట్రోల్ ఉండడం అవసరమని నేను భావిస్తున్నాను.

రాజేంద్రప్రసాద్ గారు డాక్యుమెంటరీలు దేశానికి చాలా సేవచేస్తున్నాయని, ఇవి వినోదదాయకం కాకపోవచ్చుగాని విద్యాదాయకంగా ఉన్నాయనక తప్పదనీ అన్నారు.

రాజేంద్రప్రసాద్ గారు నిర్వచించిన ప్రభుత్వవైఖరిలో కొత్త అంశం ఏమీ లేదు. పాతవైఖరినే రాష్ట్రపతి పీఠంనుంచి పునరుద్ఘాటించడం జరిగింది. ఆయన చెప్పినదంతా పూర్తిగా నైతికమైన విలువలకు సంబంధించినదే కనుక, అందులో వ్యతిరేకించవలసిన దేమీ లేదు. పైగా అదంతా సమర్థించదగినదే అయివుంది. అయినప్పటికీ ఈవిధమైన ఉద్ఘాటనలవల్ల సినిమా పరిశ్రమపరిస్థితిలో మార్పు వస్తుందని ఆశించడం వృథా. ప్రభుత్వం తన విధానాన్ని అమలులో పెట్టడానికి కావలసిన రాజ్యాంగాధికారం పొంది, ఆపైన మాట్లాడితే అర్థం ఉంటుందిగాని ఇటువంటి ఉపన్యాసాలవల్ల పీసమెత్తుపని జరగబోదు.

నిజానికి సినిమా పరిశ్రమ అధ్వాన్నంగా ఉందని పారిశ్రామికులను నిందించి లాభం లేదు. పరిశ్రమపట్ల ప్రభుత్వవైఖరి ఉత్తమ చిత్రాల నిర్మాణానికి తోడ్పడేదిగా లేదు. నిజంగా ఉత్తమమైన చిత్రాలు తీయదలుచుకున్న నిర్మాత (తీయగలగడం, తీయలేకపోవడం వేరేసంగతి), ధనార్జనమే ప్రధానంగా పెట్టుకుని చవకబారు అభిరుచులతో చిత్రం తీసే నిర్మాతతో పోటీ పడవలసి వస్తోంది. ఈ పోటీలో మొదటి రకం నిర్మాత ఓడిపోయి చేతులు కాల్చుకుంటున్నాడు; రెండోరకం నిర్మాతపద్ధతినే అనుసరించవలసినవాడవుతున్నాడు. ప్రభుత్వం విధించే పన్నులభారం అత్యధికంగా ఉంటోంది. ఈ భారం ఉత్తమ చిత్రం తీయదలచిన నిర్మాత మీదా, రెండోరకం నిర్మాతమీదా సమానంగానే పడుతోంది ప్రజాబాహుళ్యం — ని, ప్రభుత్వంగాని మొదటిరకం నిర్మాతమీద ప్రత్యేకమైన సానుభూతి ఏమీ చూపడం లేదు. ఈ పరిస్థితిలో అతను తన ఆదర్శాలకు అంటిపెట్టుకుని ఉండడం అసంభవమని గ్రహించి దిగజారిపోతున్నాడు.

ఇక సినిమాపరిశ్రమలోనే అంతరంగికంగా చిత్రనిర్మాతలు ఎదుర్కోవలసిన పోటీదార్లున్నారు. చిత్రం తయారుచేసి ఇచ్చేంతవరకే నిర్మాత బాధ్యతకాని, మిగతా అన్నివిషయాల్లోనూ అతడు డిస్ట్రిబ్యూటర్ల, ఎగ్జిబిటర్ల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడవలసినవాడే. డిస్ట్రిబ్యూషన్, ఎగ్జిబిషన్ శాఖలకూ ప్రొడక్షన్ శాఖకూ అంతరంగికంగా ఉన్న పోటీవల్ల ప్రొడక్షన్ శాఖే ఎక్కువగా చితికిపోతోంది. మొదటి రెండు శాఖలూ లాభం చేసుకుంటున్నాయి. ఈ విషయంలో చిత్రనిర్మాత నిస్సహాయుడు.

మొత్తంమీద చూస్తే, దేశంలో తయారయ్యే చిత్రాల నైతికస్థాయికీ, సినిమా పరిశ్రమ తాలూకు ఆర్థిక వ్యవహారాలకీ గాఢ సంబంధం ఉన్నది. ఆర్థికవ్యవహారాలే మన చిత్రాల మంచిచెడులను తీర్చి దిద్దుతున్నాయి. అందుచేత ఆర్థికంగా సంస్కరణలు జరిపి తద్వారా నైతికస్థాయి అభివృద్ధిని సాధించడానికి ప్రయత్నించాలిగాని నైతికస్థాయినొక్కదాన్నే అభివృద్ధి చెయ్యాలని ప్రయత్నించడం తెలివితక్కువ. ప్రబోధాత్మకచిత్రాలుతీసి, (అవి ఎంతో ఉత్తమకళాఖండాలే తప్ప,) మార్కెట్‌లో ఇతరచిత్రాలతో పోటీచేయలేక దెబ్బతిన్న అనేకులు నిర్మాతలను ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాము. అందుచేత ప్రబోధాత్మక చిత్రాలనే మీరు తీయండి అని ఉపన్యాసాలతో నిర్మాతలను కోరడం ప్రయోజనకారికాదు. ఏదో ఒక మంచి చిత్రానికి పతకం బహూకరించినందువల్ల ప్రభుత్వం ఆశించే మార్పులు జరగబోవు.

ప్రభుత్వానికి సినిమా పరిశ్రమపట్ల నిజంగా శ్రద్ధాసక్తులే ఉన్నట్లయితే, ఈ పరిశ్రమతాలూకు ఆర్థికవ్యవహారాలను, ఆర్గనైజేషన్‌ను కూలంకషంగా సంస్కరించాలి. చిత్రనిర్మాతలకు ధనసహాయం చేసే ఫిలిం ఫైనాన్స్ కార్పొరేషన్‌ను స్థాపించడం అత్యవసరం.

అయితే, ఇటువంటి కార్పొరేషన్ స్థాపించినంతమాత్రాన సినిమాపరిశ్రమ ఆర్థికంగా బలపడుతుందనడం కూడా సంశయాస్పదమే. బ్రిటన్‌లో స్థాపించబడిన నేషనల్ ఫిలిం ఫైనాన్స్ కార్పొరేషన్ కొంతకాలం క్రిందట దివాళా తీసింది. దాని వ్యవహారంలో బ్రిటిష్‌ప్రభుత్వం



మాస్కో సినిమా క్లబ్‌లో భారతీయ చలనచిత్రోత్సవం సెప్టెంబరు 28 న మొదలైనప్పుడు ప్రేక్షక సమూహాల దృశ్యం.
(ఫొటోలు : ఎమ్. ఫిలిమనోవ్)



బిమల్ రాయ్ దేశంలో లేనందున ఆయన తరఫున ఎస్. ఎస్. వాసన్ ప్రశంసా పత్రాన్ని అందుకున్నారు.

చేతులు కాల్చుకుంది. కనుక బ్రిటన్ కూడా వారణను జాగ్రత్తగా పరిశీలించి, అందులో జరిగిన లోటుపాట్లనుంచి గ్రహించి, ఆపైన ఒక నిర్ణయానికి రావలసివుంది. అదీగాక, దేశంలో ఇతర పరిశ్రమలకు, ప్రాజెక్టులకూ అధికప్రాధాన్యం ఇస్తున్న మన ప్రభుత్వం సినిమా పరిశ్రమకోసం కొత్తగా ఆర్థిక సహాయమేమీ చేయలేదని డా॥ కేస్కార్ చాలాసార్లు స్పష్టపరిచారు. అందుచేత సినిమా పరిశ్రమపట్ల నిజమైన శ్రద్ధఉంటే తప్ప ప్రభుత్వం ఫైనాన్స్ కార్పొరేషన్ స్థాపనకు దిగుతుందని తోచదు. అయితే ప్రభుత్వం తేలికగా చేయగలిగిన పని మరొకటున్నది. వినోదం పన్నును కొంత తగ్గించవచ్చును. లేక ఈ పన్నుద్వారా వచ్చే ఆదాయాన్నే తిరిగి పెట్టుబడిగాపెట్టి పరిశ్రమకు సహాయం చేయవచ్చును. ఇలా చేయాలని ఫిలిం నిర్మాతలు చాల కాలంగా ఆందోళన చేస్తున్నారు కూడాను.

ఇంతకంటే ముఖ్యంగా ప్రభుత్వం జోక్యం చేసుకోవలసిన విషయం మరొకటున్నది.

ప్రొడక్షన్, డిస్ట్రిబ్యూషన్, ఎగ్జిబిషన్, ఈమూడుశాఖల మధ్యా వినాశకరమైన పోటీలేకుండా మూడింటికీ సమానంగా లాభదాయకంగా ఉండేరీతిగా నిబంధనావళిని ఏర్పరచి దాన్ని అమలుజరిపించాలి. చలనచిత్రనిర్మాణానికి ముఖ్యంగా కావలసిన యంత్రపరికరాలు ముడిఫిలిము ఈ దేశంలోనే ఉత్పత్తిఅయ్యే ఏర్పాటు చెయ్యడం ఇంకో అవసరం. ముడిఫిలిమ్ ఇతరదేశాలనుంచి దిగుమతికావడంతో నిర్మాతలకు అది తగనిబరువుకావడమేకాక అనేకకోట్ల ధనం బయటికి పోతోంది. ముడిఫిలిమ్ పరిశ్రమను ఏర్పాటుచేసి దీన్ని నివారించాలి.

ఇదిగాక ప్రొడక్షన్ శాఖలోనే ప్రభుత్వం కలగజేసుకుని అమలుచేయవలసిన సంస్కరణలనేకం ఉన్నాయి. కొంతకాలం క్రితం బొంబాయిలో అఖిల భారత సినీ టెక్నీషియన్ల సంఘం టెక్నీషియన్ల రక్షణకుగాను చేసిన కొన్ని తీర్మానాలు సత్వరమే అమలు జరపాలి.

ఈ యీ విషయాలన్నిటినీ దృష్టిలో వుంచుకుని సినిమా పరిశ్రమలోని వివిధ శాఖల ప్రతినిధులను సమీకరించి వారితో సంప్రదించి ఒక సమగ్రమైన ప్రణాళికను తయారుచేసి ప్రభుత్వం ఒక శాసనం చెయ్యాలి.

కేవలం సెన్సార్‌షిప్‌ను కఠినతరం చెయ్యడంవల్ల నైతికంగా ఉత్తమచిత్రాలు తయారుకావు. నైతికచిత్రాలు తయారవడానికి వీలిచ్చే ఆర్థిక ప్రాతిపదికనుకూడా ప్రభుత్వం కల్పించాలి. నీతులు వల్లించినంతమాత్రాన అవి అమల్లోకి రావు.

## బాలచిత్ర సంఘం

బహుమతిప్రదానసభలో డా॥ కేస్కార్ మాట్లాడుతూ, పండిట్ హృదయనాథ కుంజ్రూగారి అధ్యక్షతను బాలచిత్ర సంఘమొకటి స్థాపించబడుతుందని తెలియజేశారు. పిల్లలకు ప్రత్యేకంగా ఉద్దేశింపబడిన చిత్రాలను నిర్మించడానికి, ప్రోత్సహించడానికి ఈ సంఘం పనిచేస్తుంది. ఒక బాలచిత్రపు పూర్తి ఖర్చులను భరించడానికి, మరొక పెద్దచిత్రంయొక్క,

ఈ నెల 11 న ఢిల్లీలో పిల్లల చిత్రాలపై జరిగిన గోష్ఠిలో బీహారు గవర్నరు ఆర్. ఆర్. దివాకర్, వి. శాంతారాం మున్నగువారు పాల్గొన్నప్పటి దృశ్యం.



## బాల చిత్రసంఘం

కింతు చిన్నచిత్రాలకుమాత్రం ఖర్చుల్లో నూటికి 75 వంతులను భరించడానికి ప్రభుత్వం అంగీకరించింది.

కథాచిత్రబహుమతిపొందిన పి. కె. ఆత్రే మాట్లాడుతూ, తన చిత్రంపొందిన విజయం నిజంగా తనదికాదనీ, ఆ చిత్రానికి మూల కథ వ్రాసిన శ్రీ॥ శ్రీ॥ సానే గురూజీదనీ, ఆయన ప్రభావం మహారాష్ట్రంలో యువకులమీద అమితంగా ఉందనీ అన్నారు. తనకు బహుమతి లభించిన గౌరవం తనదు కాదనీ, 40 ఏళ్లకింపట దాదాసాహెబ్ ఫాల్కేతో ప్రారంభమైన చలనచిత్ర పరిశ్రమకనీ అన్నారు.

ఎస్. ఎస్. వాసన్ గారు మాట్లాడుతూ, తోటి నిర్మాతలకు, యావత్తు సినిమా పరిశ్రమకూ జరిగిన ఈ సత్కారానికి తాము ఆనందిస్తున్నామని అన్నారు. వాసన్ గారన్న దాన్ని భారతచిత్రనిర్మాతల గిల్డ్ అధ్యక్షుడు వి. శాంతారాం బలపరిచారు.

ఈ దిగువ చిత్రాలకు ప్రశంసా పత్రాలు ఇవ్వబడ్డాయి: బిమల్ రాయ్ నిర్మించిన "దో బీఘా జమీన్". దేబకీబోస్ తీసిన "భగవాన్ శ్రీకృష్ణ చైతన్య".

ఖాన్ పూర్ నిర్మించిన "పవిత్ర హిమాలయాలు" (డాక్యుమెంటరీ). ఎ. భాస్కర రావు తీసిన "సంపత్తి వృక్షం" (డాక్యుమెంటరీ). అజిత్ బోస్ తీసిన బెంగాలీ బాలచిత్రం "ఖేలాఘర్".

పిల్లలచిత్రం ప్రధానమంత్రి బహుమతికి అర్హమైనదేదీ రాకపోవడంవల్ల "ఖేలాఘర్"కు ప్రశంసాపత్రం మాత్రమే ఇవ్వబడింది.

బహుమతిప్రదానసభకు హాజరైన వారిలో "శ్యాంచీ అయీ" చిత్రంలో శ్యాం పాత్ర ధరించిన మాధవ్ వాజే, శ్యాం తల్లిగా నటించిన వనమాల కూడా ఉన్నారు. మాధవ్ వాజే వయస్సు 14 ఏళ్లు. అతడు పూనాలో ఒక స్కూల్లో చదువుకుంటున్నాడు. ★

## "గీతాంజలి" ఆర్కెస్ట్రా ప్రథమ వార్షికోత్సవం

గత సంవత్సరం విజయదశమినాడు ప్రారంభింపబడిన "గీతాంజలి" ఆర్కెస్ట్రా వారు మొన్నటి విజయదశమినాడు ప్రథమ వార్షికోత్సవం జరుపుకున్నారు. మైలాపూర్, వుడ్ లాండ్స్ లో సభ, అల్పాహారవిందు జరిగాయి. సభకు నగరంలోని ప్రముఖ నిర్మాతలు, నటులు, గాయకులు పలువురు హాజరైనారు. నాగయ్యగారు అధ్యక్షత వహించారు.

తమ ఆర్కెస్ట్రాబృందం గడచిన ఏడాదిగా గట్టెక్కిన గండాలను, సినిమా సంగీతంలో చేసిన కృషిని ఎమ్. రంగారావు



శోభా & రజతీవారి "బాలసన్యాసమ్మ" మొదటి షూటింగ్ రోజున—పి. సీతారాం (పూర్ణా), బేబీ గిరిజ, బేబీ శోభా, సులోచన, సముద్రాల, గిరిజ, జి. వరలక్ష్మి, టి. వి. ఎస్. శర్మ, పి. సుబ్బారావు, సముద్రాల జూనియర్, నాగేశ్వరరావు, రహమాన్, సుబ్బమ్మ మున్నగువారు.

